Photo by Brahm Dev



బహుమతి

'ఒక్కటి చెబుతా వింటావా?'

పంపినవారు :

# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★



ఇవి గాక :
చిత్రకథ, ఫోటో శీర్షికల పోటి
మొదలైన మరి ఎన్నో
ఆకర్షణలు.




# అమృతాంజనము

## నొప్పులతో కూడిన వ్యాధులు ముదరకముందే కుదురుతాయి







అమృతాంజనము బాధను నివారించడమే గాక బాధ కారణాన్ని కూడా నిర్మూలిస్తుంది. ఇది రక్త సంచయాన్ని శమింపజేసి రక్త ప్రవాహాన్ని క్రమపరచుటకు ఉపకరించును.

ప్రతిసారి దీనిని అతి కొంచెమే ఉపయోగించవలసి ఉండడంచేత ఒక బుడ్డి నెలలతరబడి వస్తుంది.

అమృతాంజన్ లిమిటెడ్, మద్రాసు-4, బొంబాయి-1 కలకత్తా & న్యూ ఢిల్లీ

---

# తిరిగి ఆశ్చర్యముగాపూర్తి స్వస్థత చేకూరుతుంది !



వాటర్‌బరీస్ కాంపౌండ్ టానిక్కును ప్రపంచములో ఆరోగ్యమును వాంఛించు పిన్నలు పెద్దలు అందరూకూడా ఆరోగ్యము నిచ్చుటలో సాటి లేనిదని పేరొందుటచే విడువక వాడుచున్నారు.

వాటర్‌బరీస్ కాంపౌండ్ లో ముఖ్యమైన పోషక పదార్థములు కలసి యుండుటచే సౌఖ్యప్రదమగు జీవితమును ప్రసాదించి మీ కుటుంబమునకు అవసరమైన అదనపు శక్తిని చేకూర్చును.

వాటర్‌బరీస్ కాంపౌండ్ ఎడతెగని దగ్గు, పడిశములు, శ్వాసకోశపు రుగ్మతలను నివారించును. వ్యాధినుండి త్వరితముగా కోలుకొనుటకు డాక్టర్లు దీనిని సిఫారసు చేయుచున్నారు.

పిల్‌ఫర్-ప్రూఫ్ మూతతో, క్రొత్త ఎఱ్ఱ లేబిల్‌తో యిప్పటి సరఫరా.



ఎఱ్ఱ రాపర్ ఇప్పుడు తీసివేయబడినది.

ఆరోగ్యమునకు హితమైన

# వాటర్‌బరీస్ కాంపౌండ్

వాడుడు

"ఈ బోనసుతో నాకోజత బంగారపు గాజులు కొంటానన్నారు తను.
కాని నేనే తనకో సైకిలు కొనుక్కోమని నిర్బంధపెట్టాను.
సహజంగా అత్యుత్తమమైన
దానిని కొన్నాము – హెర్క్యులిస్"

హెర్క్యులిస్‌కు ఎంతైనా త్యాగంచేయవచ్చు. ఎందుకంటె—అది నిజానికి సైకిల్‌కంటె ఎక్కువైనది, అది మీ ప్రాణమిత్రుడు. దాని అందచందాలవల్ల, సునాయాసంగా వెళ్లేది కావడంవల్ల అది మీరు కొనవలసిన అత్యుత్తమ రకమైన సైకిల్.

తయారీ : టి. ఐ. సైకిల్స్ ఆఫ్ ఇండియా, మద్రాసు

మీ సైకిల్ మీకు పెట్టుబడి

# హెర్క్యులిస్



మీ డబ్బుకు ఉత్తమమైన ప్రతిఫలం



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచికలో "ప్రతిమలు" అన్న మరొక భాస నాటక కథ ప్రచురించాం. ఇది భాసుడి ఉత్తమ రచనలలో ఒకటిగా పరిగణించబడుతున్నది. ఇందులోది రామాయణకథే అయినా భాసుడు ఆ కథను తన ఇష్టంవచ్చినట్టు మార్చాడు.

ఈ నాటకంలో భాసుడి శిల్ప చాతుర్యం అత్యద్భుతంగా కనిపిస్తుంది. రాముడి వనవాస ప్రసక్తి రాకముందే రంగస్థలం మీదికి నార బట్టలు వస్తాయి; "మహారాజుకు స్వస్థతగా లేదా?" "ఎవరో రాజు కాబోతున్నారు," "అభిషేక జలం అశ్రువులు కడుగు కోవటానికే నన్న మాట"—ఇలాటి వాక్యాలు సంభాషణలలో వినిపిస్తాయి.

ఇష్టంలేని భావాలు వాటంతట అవే అణగారిపోతాయని ఈ కాలపు మనోవైజ్ఞానికులు కనిపెట్టారు. కాని దానికి ఉదాహరణ ఏనాడో భాసుడు ఈ నాటకంలో ఇచ్చాడు; భరతుడు తన తండ్రి ప్రతిమను గురించి అడగకుండా ప్రతిమాశాల నుంచి పోబోతాడు. ఇది అద్భుతమైన సృష్టి.

సంపుటి 26 : ఫిబ్రవరి 1960 : సంచిక 2




# మహాభారతం

ఆయిదో రోజు సూర్యోదయానికల్లా తిరిగి ఉభయపక్షాలూ యుద్ధానికి దిగాయి. భీష్ముడు కౌరవసేనను మకర వ్యూహంలో అయత్తంచేశాడు. పాండవ సైన్యాలు శ్యేన వ్యూహంలో ఏర్పాటయాయి. మళ్ళీ భీముడే పాండవసేనకు ముందుగా నిలబడ్డాడు. యుద్ధం ఆరంభమవుతూనే భీముడు భీష్ముడితో తలపడ్డాడు. ఉభయపక్షాల యోధులలోనూ పౌరుషాలు రెచ్చిపోయి ఉన్నాయి. యుద్ధం మహాదారుణంగాసాగింది.

భీష్ముడు రౌద్రంగా పాండవ సేనను నిర్మూలించటానికి పూనుకున్నాడు. ఆయనను నిరోధించటానికి అర్జునుడు ప్రయత్నించాడు. భీష్ముడు చేసే యుద్ధం చూసి పొంగిపోయినవాడై దుర్యోధనుడు ద్రోణుడితో, "ఆచార్యా, నీవూ భీష్ముడూ ఉండగా మాకు దేవతలను చూసినా భయంలేదు, ఈ పాండవులేపాటి? వీరు సులువుగా చనిపోయే పద్ధతి చూడు," అని ఆయనను ప్రేరేపించాడు.

ద్రోణుడుకూడా విజృంభించి పాండవ సేనల నిర్మూలనానికి పూనుకున్నాడు. ఇది చూసి సాత్యకి కోపోద్రేకంతో ఆయనను ఎదిరించాడు. ఇద్దరికీ ఘోరయుద్ధం జరిగింది. ద్రోణుడు సాత్యకి కొంకి ఎముకలను తన బాణాలతో కొట్టాడు. భీముడు సాత్యకిని రక్షించటానికి వచ్చి ద్రోణుడితో తలపడ్డాడు. అతనికి సహాయంగా అభిమన్యుడూ, ఉపపాండవులూ వచ్చారు. భీష్మద్రోణులు ఏకమై యుద్ధం సాగించారు. ఇంతలో శిఖండి వచ్చాడు. భీష్ముడు తన నియమం ప్రకారం శిఖండిపై బాణాలు వేయలేదు, కాని ద్రోణుడు శిఖండిని భయంకరంగా ఎదుర్కొనేసరికి శిఖండి పారిపోయాడు.

తరవాత ఉభయపక్షాలమధ్యా దారుణమైన సంకుల సమరం సాగింది. ఎందరో

పాండవపక్ష వీరులు భీష్ముడివాత పడ్డారు. యుద్ధరంగం భీభత్సంగా తయారయింది. భూమ్యాకాశాలు ఆయుధాలతోనూ, పీనుగులతోనూ, దుమ్ముతోనూ, కేకలతోనూ నిండిపోయాయి. రక్తం ఏరులై పారింది. యోధులు ఆయుధాలు లేకపోతే ముష్టి యుద్ధానికికూడా దిగారు.

ఈ సంకుల యుద్ధంతోపాటు ఉభయ పక్షాల యోధులమధ్య అనేక ద్వంద్వ యుద్ధాలుకూడా సాగాయి.

ఒకసారి సాత్యకి భీష్ముణ్ణి ఎదుర్కొని గట్టి దెబ్బ తిన్నాడు. అతని సారథి భీష్ముడి బాణం తగిలి చచ్చాడు; రథాన్ని లాక్కుంటూ సాత్యకి గుర్రాలు పారిపోయాయి. పాండవులు హాహాకారాలు చేశారు. అలాగే అశ్వత్థామకూ, అర్జునుడికీ జరిగిన యుద్ధంలో అశ్వత్థామ విజృంభించాడు. అర్జునుడు వేసిన బాణాలు శరీరమంతా తగిలి రక్తం కారినా అతను చలించక, కృష్ణార్జునులిద్దరికీ తన బాణాల పస చూపించాడు. కౌరవులు అతన్ని చూసి పరమానందం చెందారు.

ఇంకొకసారి లక్ష్మణకుమారుడికి అభిమన్యుడికీ ద్వంద్వయుద్ధం జరిగింది. అందులో లక్ష్మణుడు బాగానే యుద్ధం




చేశాడుగాని తన సారథినీ, గుర్రాలనూ కోల్పోయాడు. అప్పటికీ చలించక లక్ష్మణుడు తీవ్రమైన శక్తిని విసరగా అభిమన్యుడు దానిని తన బాణాలతో కొట్టేశాడు. ఇంతలో కృపుడు వచ్చి లక్ష్మణుణ్ణి తన రథంలో ఎక్కించుకుని అవతలికి తీసుకుపోయాడు.

ఆ సాయంకాలం సాత్యకి విజృంభించి కౌరవసేనలను నిర్మూలించటం చూసి దుర్యోధనుడు అతనిపైకి రథ సైన్యాన్ని పంపాడు. సాత్యకి తన తీవ్రమైన బాణాలతో ఆ సేనను నిర్మూలించసాగాడు. అది చూసి భూరిశ్రవుడు సాత్యకిపైకి వచ్చాడు.

అతని బాణాలకు తట్టుకోలేక సాత్యకికి అండగా ఉన్న యోధులందరూ వెనుదిరిగి పారిపోయారు.

అప్పుడు సాత్యకి కొడుకులు చిత్రవర్మ మొదలు గాగలవారు అనేకమందిగా కలిసి వచ్చి భూరిశ్రవుడితో, "మాలో ఏ ఒకరితో నైనా పోరాడతావా? లేక అందరితోనూ పోరాడతావా?" అని అడిగారు. మహాయోధు డైన భూరిశ్రవుడు అందరితోనూ పోరాడతా నన్నాడు. అందరూ తనపైన ఒక్కసారిగా బాణాలు వేసినప్పటికీ, భూరిశ్రవుడు వారి బాణాలన్నిటినీ ఖండించటమే గాక సాత్యకి కొడుకులను వరసగా చంపేశాడు.

సాత్యకికి మండిపోయింది. అతను భూరిశ్రవుడితో భీకరమైన యుద్ధం చేశాడు. ఈ యుద్ధంలో ఇద్దరి విల్లులూ, రథాలూ, గుర్రాలూ పోయాయి. చెరొక కత్తీ పట్టుకుని వారు యుద్ధంచేసే సమయంలో భీముడు రథంలో వచ్చి, సాత్యకిని ఎక్కించు కున్నాడు; దుర్యోధనుడు వచ్చి భూరిశ్రవుణ్ణి తన రథంలోకి ఎక్కించుకున్నాడు. తరవాత కొద్దిసేపటికి సూర్యాస్తమయ మయింది. ఆనాటికి యుద్ధం ముగిసింది.

ఆ రాత్రి గడిచి ఆరవరోజు తెల్లవారేసరికి మళ్ళీ ఉభయసేనలూ యుద్ధ సన్నద్ధ మయాయి. ఈసారి పాండవసేనలు మకర



వ్యూహంలోనూ, కౌరవసేనలు క్రౌంచ వ్యూహంలోనూ రచించబడ్డాయి.

ఆరంభంలోనే భీముడు ద్రోణుడితో తలపడ్డాడు. ద్రోణుడు భీముడి మర్మస్థానాలను ఇనపబాణాలతో కొట్టేసరికి భీముడు కోపించి, ద్రోణుడి సారథిని ఒక్క బాణంతో చంపేశాడు. మహాయోధుడైన ద్రోణుడు తన రథాన్ని తానే నడుపుకుంటూ కూడా దారుణమైన యుద్ధం చేశాడు.

తరవాత భీముడు చెలరేగి దుర్యోధనుడు మొదలుగాగల ధృతరాష్ట్ర పుత్రులపైన వచ్చిపడ్డాడు. వారందరూ ఒక్కచోట కనిపించేసరికి భీముడికి భీష్ముడి భయంకూడా పోయింది, ఆతను ఒంటరిగా కౌరవసేనలో జొరబడ్డాడు. ఇది చూసి అందరూ, "భీముణ్ణి ప్రాణాలతో పట్టుకుందాం!" అనుకున్నారు. దుశ్శాసన, దుర్విషహ, దుస్సహ, దుర్మద, జయ, జయసేన, వికర్ణ, చిత్రసేన, సుదర్శన, చారుచిత్ర, సువర్మ, దుష్కర్ణులు మొదలుగాగలవారు భీముణ్ణి చుట్టుముట్టారు. ఆ వ్యూహంలో చిక్కుకుని కూడా భీముడు భయపడకపోగా, వాళ్ళు తనను పట్టుకోజూస్తున్నారని తెలిసి, ఆగ్రహావేశంతో గద తీసుకుని వారిమీదికి వెళ్ళాడు.

భీముడు ఏదో ఆఘాయిత్యానికి పూనుకున్నాడని పసికట్టి, పాండవుల సర్వసేనాని





అయిన ధృష్టద్యుమ్నుడు, తాను యుద్ధం చేస్తున్న ద్రోణుణ్ణి వదిలిపెట్టి, భీముడి రథం ఉన్న చోటికి వచ్చాడు. ఖాళీగా ఉన్న రథం చూడగానే అతని శరీరం వణికిపోయింది. అతను కంపిస్తున్న గొంతుతో భీముడి సారథిని, "భీముడెక్కడ?" అని అడిగాడు.

"మహారాజా! నన్ను రెండు గడియల పాటు ఇక్కడే ఉండమని చెప్పి, ధృతరాష్టుడి కొడుకులను చంపిరావటానికిగాను కౌరవ సైన్యంలో జొరబడ్డాడు!" అని సారథి సమాధానం చెప్పాడు.

"అయ్యో, భీముణ్ణి పోగొట్టుకుంటే ఇక నేను జీవించిఉండి మాత్రం ఏమి ప్రయోజనం!" అనుకుంటూ ధృష్టద్యుమ్నుడు ముందుకు చొచ్చుకుపోగా, కొంతదూరాన భీముడు, దారిలో వచ్చిన ప్రతి ఏనుగునూ, రథాన్నీ తన గదతో మోదుతూ, ముందుకు పోతూ కనిపించాడు. అతని చుట్టూ హాహాకారాలు చెలరేగుతున్నాయి, కాని అతని శరీరంనిండా బాణాలే!

ధృష్టద్యుమ్నుడు భీముణ్ణి తన రథమెక్కించి, అతని ఒంటిన గుచ్చుకున్న బాణాలన్నీ పీకేసి, ఉపచారాలు చేసి, కౌగలించుకున్నాడు. ఇంతలో దుర్యోధనుడూ, అతని తమ్ములూ కలిసి ధృష్టద్యుమ్నుడిపై కలియబడ్డారు. ధృష్టద్యుమ్నుడు వారందరినీ ఒక్కసారి కలయజూసి సమ్మోహనాస్త్రం వేసి దుర్యోధనాదులందరినీ మూర్ఛ పోగొట్టాడు.

అవతల ద్రుపదుడితో యుద్ధంచేస్తూ ద్రుపదుణ్ణి తరిమికొట్టిన ద్రోణుడు తన ప్రభువులైన దుర్యోధనాదులు మూర్ఛలో ఉండటం తెలిసి వేగంగా వచ్చి ప్రజ్ఞాస్త్రం వేసి సమ్మోహనాస్త్రాన్ని భగ్నంచేసేసరికి అందరూ మూర్ఛనుంచి లేచారు. వారు తిరిగి భీముడితో యుద్ధానికి ఉపక్రమించారు. భీముడికీ, దుర్యోధనుడికీ తీవ్రంగా యుద్ధం జరిగింది. అప్పటికి మధ్యాహ్నమయింది.

ఈ లోపుగా భీముడికి సహాయంగా ధర్మరాజు పన్నెండుమంది యోధులను, అభిమన్యుడూ, ధృష్టకేతువు, కైకేయులూ, ఉపపాండవులూ మొదలైనవారిని, పంపాడు. వారు రావటం చూసి కౌరవులు వెళ్ళిపోయారు. వారు తనచేత చావకుండా దాటిపోయినందుకు భీముడు చాలా చింతించాడు.

అపరాహ్ణం లగాయతు సాయంకాలం దాకా తిరిగి ఉభయపక్ష వీరులూ తీవ్రంగా పోరాడారు. ఒకవైపున భీష్ముడు పాండవ సేనలను చెండుకుతింటే, దక్షిణ పార్శ్వంలో అర్జునుడు కౌరవ సేనలను బూడిదచేశాడు. సూర్యాస్తమయం కాబోతూండగా భీముడూ, దుర్యోధనుడూ మళ్ళీ తలపడ్డారు. భీముడు పిడుగుల్లాటి బాణాలతో దుర్యోధనుణ్ణి కొట్టాడు; అతని సారథినీ, గుర్రాలనూ చంపాడు; అతని ఛత్రాన్నీ, పాము జెండానూ పడగొట్టాడు. అంతలో కృపుడు వచ్చి దుర్యోధనుణ్ణి ఇంకొక రథంలో కూచోబెట్టాడు. బాగా దెబ్బలు తినిఉన్న దుర్యోధనుడు రథంలో చేరగిలబడి కూచున్నాడు.

తరవాత సైంధవుడు వచ్చి భీముణ్ణి ఎదుర్కొన్నాడు. భీముడికి అండగా వచ్చిన అభిమన్యుడు మొదలుగాగలవారు దుర్యోధనుడి తమ్ములతో తలపడ్డారు. ఈ యుద్ధంలో




దుర్యోధనుడి తమ్ములలో ఒకడైన వికర్ణుడు అభిమన్యుడి బాణాలదెబ్బకు పడిపోయాడు. దుర్ముఖుణ్ణి శ్రుతకర్మ చంపేశాడు. దుష్కర్ణుడు నకులుడి కొడుకైన శతానీకుడితో యుద్ధంచేసి చనిపోయాడు. అంతలోనే సూర్యాస్తమయం అయింది, ఆ నాటికి యుద్ధం ముగిసింది.

ఉభయపక్షాల యోధులూ తమతమ శిబిరాలకు తిరిగి వెళ్ళి, యుద్ధం గురించి ముచ్చటించుకున్నారు, ఒకరి పరాక్రమాన్ని ఒకరు ప్రశంసించుకున్నారు.

ఆ రోజు జరిగిన యుద్ధంలో దుర్యోధనుడు బాగా దెబ్బతిని ఉండటంచేత అతని

మనస్సు చింతతో నిండిపోయి ఉన్నది. అతను తన తాతగారైన భీష్ముడి వద్దకు వెళ్ళి, "తాతా, మనం ఎలాటి అభేద్యమైన వ్యూహాన్ని పన్నినా పాండవులు దానిని భేదించి విజృంభిస్తున్నారు. ఇవాళ భీముడు నన్ను చాలా పీడించాడు, మన సైన్యాన్ని చాలా నాశనం చేశాడు. నేను యుద్ధ రంగంలో మూర్ఛపోయాను. ఇంతవరకూ నా మనస్సు స్థిమితపడనేలేదు. ఓ మహానుభావా, నీ అనుగ్రహం ఉంటే తప్ప నేనా పాండవులను చంపి విజయం సాధించలేను," అన్నాడు.

దుర్యోధనుడి మనసు ఎంతో చింతాక్రాంతమై ఉన్నదని గ్రహించి భీష్ముడు అతనికి తిరిగి ధైర్యోత్సాహాలు కలిగించటానికి ఇలా అన్నాడు:

"రాజా, నీకు విజయం కలగగలందులకు నేను పాండవ సైన్యాలలో జొరబడి యథాశక్తి పోరాడుతూనే ఉన్నానుగాని ఒళ్ళు దాచుకోవటానికి ఎలాటి ప్రయత్నమూ చెయ్యటంలేదు. పాండవులు చూడబోతే శూరులూ, మహారథులూ, అస్త్రాలు ఎరిగిన వారూ, ఆగ్రహించెంది ఉన్నవారూనూ. వారిని జయించటం తేలికకాదు. అయినా జీవితాశ లేకుండా వారిని ఎదుర్కొంటున్నాను. ఇకముందుకూడా అలాగే పోట్లాడతాను. నేనేగాక, ద్రోణుడూ, శల్యుడూ, కృతవర్మ, అశ్వత్థామా, సోమదత్తుడూ, సైంధవుడూ, విందానువిందులూ, బాహ్లికుడూ మొదలైన మేటి వీరులందరూ నీకోసం ప్రాణాలు అర్పించ సంసిద్ధులై ఉన్నారు. చివరకు పాండవులే నన్ను జయిస్తారో, నేనే పాండవులను జయిస్తానో అదిమాత్రం చెప్పలేను."

దుర్యోధనుడితో భీష్ముడీ విధంగా కొంతసేపు సంభాషించి, అతని దుఃఖాన్ని ఉపశమింపజేయటానికి విశల్యకరణి అనే ఓషధిని ఇచ్చాడు.






## 2

[ధవళగిరి రాజకుమారుడైన చిత్రసేనుడు, అడవికి వేటకు వెళ్లి, కొండగుహలో ఒక సిద్ధుణ్ణి చూశాడు. సిద్ధుడు అతడికి ఒక వెదురుబుట్ట యిచ్చాడు. చిత్రసేనుడు ఆ బుట్ట మూత తీయగానే, ఒక మహాభవనం కనిపించింది. ఆ వెంటనే ఉగ్రాక్షుడనే రాకసుడు రంకెలువేస్తూ అక్కడికి వచ్చాడు. ప్రాణాలతో బయటపడేందుకు చిత్రసేనుడు, తనకు మొదటగా పుట్టబోయే కొడుకును, ఆ రాకసుడి పరం చేయటానికి ఒప్పుకున్నాడు. తరవాత—]

ఉగ్రాక్షుడు అడవిచెట్ల చాటున కనిపించకుండా పోగానే, చిత్రసేనుడు బతుకుజీవుడా అనుకుంటూ ఒక పెద్ద నిట్టూర్పు విడిచాడు. ఏదో విధంగా తను ప్రాణాపాయంనుంచి బయటపడ్డాడు. ఇక తను ఈ కీకారణ్య ప్రాంతం వదిలి, ఏదో విధంగా ధవళగిరి నగరం చేరాలి.

చిత్రసేనుడు యిలా ఆలోచిస్తూ లేచి నిలబడి పడమటిదిక్కు కేసి చూశాడు. సూర్యుడు అస్తమించటానికి మరెంతో కాలం లేదు. తన ఎదురుగా, ఆకాశాన్నంటుతున్నట్టున్న పెద్ద భవనం బురుజులమీద, సూర్య కిరణాలు ఎర్రని కాంతులతో ప్రసరిస్తున్నవి. ఆ వెలుగులో ఎత్తయిన భవనం బురుజులు మిలమిలలాడుతున్నవి.

"ఎంత అందమైన భవనం! ఇందులో అడవిమృగాలూ, గుడ్లగూబలూ, గబ్బిలాలూ నివసించవలసిందేగదా!" అనుకుంటూ






చిత్రసేనుడు తన దృష్టిని మరొకవైపుకు తిప్పి, నిరుత్సాహంగా బయలుదేరాడు.

అతడు ఆ విధంగా నాలుగైదడుగులు వేశాడో లేదో, అంతలో హఠాత్తుగా వెనక నుంచి, "మహారాజా!" అన్న పిలుపు వినబడింది. "మహారా జెవరు? ఈ నట్టడవిలో ఈ మానవ కంఠస్వరం ఎక్కడిది?" అనుకుంటూ చిత్రసేనుడు ఆశ్చర్యపడి వెనుదిరిగి చూశాడు. అతడి కంటికి విలువైన దుస్తులు ధరించివున్న ముగ్గురు వ్యక్తులూ, వారికి కొంచెం వెనకగా కొందరు భటులూ కనిపించారు. ఈ వింత చూసి చిత్రసేనుడు ఏమో అనబోయేంతలో, విలువైన దుస్తులు ధరించివున్నవారిలోనుంచి ఒకడు వేరుపడి ముందుకు వచ్చి అతడికి నమస్కరిస్తూ, "మహారాజా! మీరు ఎంతకూ రాజభవనానికి రాకపోయేసరికి, మీకోసం అడవి అంతా గాలిస్తూ, చివరికి మిమ్ములను యిక్కడ కలుసుకున్నాం," అన్నాడు.

"నేనా, మహారాజును!" అంటూ చిత్రసేనుడు విస్తుపోయాడు.

చిత్రసేనుడిలా అనగానే, ముందుకు వచ్చి అతణ్ణి మహారాజా అని సంబోధించిన వ్యక్తి చటుక్కున వెనుదిరిగి, "సేనానీ, మహారాజుగారు చాలా శ్రమపడినట్టున్నారు. బోయీలెక్కడ?" అన్నాడు ఆదుర్దాగా.

"మంత్రిగారు, వాళ్లను చెట్లచాటున ఆగి తమ ఆజ్ఞకోసం వేచివుండమన్నారుగదా!" అంటూ సేనాని అక్కడినుంచి కదిలి, కొంత దూరం వెళ్ళి గట్టిగా చప్పట్లు చరిచాడు. ఆవెంటనే "అయ్యా, వస్తున్నాం!" అన్న జవాబు వినబడింది. మరుక్షణంలో పల్లకి ఎత్తుకుని బలిష్ఠులైన నలుగురు బోయీలు చిత్రసేనుడి దగ్గిరకు వచ్చారు.

సేనానాయకుడిచేత మంత్రి అని పిలవబడిన వ్యక్తి, ఎంతో గౌరవపురస్సరంగా చిత్రసేనుడిని సమీపించి వంగి ప్రణామం చేస్తూ, "మహారాజా! పల్లకీ తెప్పించాను,



అధిష్టించండి. మీ కేమాత్రం ఆయాసం కలగకుండా బోయీలు, ఈ పల్లకీలో తమను భవనంలోని తమ పడకగదికి చేరుస్తారు," అన్నాడు.

మంత్రి అన్న ఈ మాటలు వింటూంటే, చిత్రసేనుడికి నిజంగానే తను అధికశ్రమ చేసి వున్నందున అడుగు తీసి అడుగు వేయలే ననిపించింది. ఆకారణంగా అతను మారు మాటాడకుండా పల్లకీ ఎక్కి కూచున్నాడు. 'ఊఁ' అంటూ మంత్రి బోయీలను హెచ్చరించి, అంతలో తన దగ్గిరకు వచ్చి చెవిలో ఏమో చెప్పిన వ్యక్తితో, "కోశాధికారి గారు క్షమించాలి. మహారాజుగారికి విశ్రాంతి అవసరంగనక, ఈ విషయం వీలువెంట వారితో సంప్రతించ వచ్చును. ఇది సమయంకాదు," అన్నాడు.



పల్లకీలో ఎక్కి కూచున్న చిత్రసేనుడు ఈ సంభాషణ వింటూనే, "ఓహోఁ, నాకు రాజభవనమే కాకుండా, మంత్రీ, సేనానాయకుడూ, కోశాధికారీకూడా వున్నారన్నమాట!" అనుకున్నాడు ఎంతో ఆశ్చర్యపడుతూ.

కొద్దిసేపటి తరవాత బోయీలు చిత్రసేనుణ్ణి భవనం పై అంతస్తులోని ఒక విశాలమైనగది దగ్గిర దించారు. అతడు పల్లకీ దిగి గదిలో ప్రవేశిస్తూనే, అక్కడి హంస తూలికాతల్పం, చక్కని మెత్తలు, కింద పరిచివున్న రత్నకంబళులు చూసి మరింత ఆశ్చర్యపడ్డాడు. ఇది కలా లేక వాస్తవమా అన్న అనుమానంకూడా ఓ తృటికాలం అతణ్ణి బాధించింది.

ఇదంతా సిద్ధుడి మహిమ అనుకున్నాడు చిత్రసేనుడు. ఇంత చిన్న వెదురుబుట్టలో ఆకాశాన్నంటే మహాభవనాన్ని దాచిపెట్ట గలిగిన ఆ మహాసిద్ధుడికి, ఆ భవనంలో రాజోచితమైన యిన్ని సౌకర్యాలూ, మంత్రి సేనానాయకుల్నీ, నౌకర్లనూ ఏర్పాటు చేయటం పెద్ద సమస్య కాదనుకున్నాడతడు.





తనకు ఇంత మేలుచేసిన సిద్ధుణ్ణి గురించి ఎంతో కృతజ్ఞతాభావంతో చిత్రసేనుడు తల పోస్తూవుండగా, అతడికి పంచభక్ష్య పర మాన్నాలతో భోజనం వచ్చింది. మధ్యాహ్నం నుంచి ఆకలితో నకనకలాడుతున్న అతడు తృప్తిగా భోజనంచేశాడు. తరవాత హంస తూలికాతల్పంమీద మేను వాల్చి, భావి కార్యక్రమాన్ని గురించి ఆలోచించసాగాడు.

ఇలాంటి ఆలోచనల్లోనే చిత్రసేనుడికి నిద్రపట్టింది. అతడికి మెలుకువ వచ్చేసరికి గది గవాక్షం నుంచి లేత సూర్యకిరణాలు లోపలికి ప్రసరిస్తున్నవి. తను ఒక రాత్రి ఆ అపూర్వ భవనంలో గడిపాననీ, సూర్యో దయం అయిందనీ అతడు గ్రహించాడు. వెంటనే తల్పం మీదినుంచి లేచి, కాల కృత్యాలు తీర్చుకుని, గదినుంచి బయటికి రాబోయేంతలో మంత్రి వాకిలి దగ్గర తారస పడ్డాడు. "మహారాజుగారు, రాత్రి సుఖనిద్ర పోయారనుకుంటాను. అనుమతి అయితే, రాజ్యానికి సంబంధించిన ముఖ్యవిషయాలు నివేదించగలను," అన్నాడు మంత్రి.

రాజ్యం గురించికాని, దానికి సంబంధించిన వ్యవహారకాండ గురించికాని చిత్రసేనుడికి ఏమీ తెలియదు. ధవళగిరిని తండ్రి పాలిస్తున్నాడు. ఆయన తరవాత సింహాసనాన్ని అధిష్ఠించవలసినవాడు అన్న శూర





సేనుడు. ఆ కారణాలవల్ల చిత్రసేనుడు ఏనాడూ పరిపాలనకు సంబంధించిన వ్యవహారాల జోలికి పోవటంగాని, వాటిలో ఆసక్తి కనబరచటంగాని చేయలేదు. కాని మంత్రి వాటి ప్రసక్తి తేగానే, అతడికి చప్పున తన తలిదండ్రుల సంగతి జ్ఞాపకం వచ్చింది. తన అన్న శూరసేనుడు వీ ప్రమాదానికీ లోనుకాకుండా ధవళగిరి నగరాన్ని చేరివుంటే, తన క్షేమాన్ని గురించి తలిదండ్రులు చాలా ఆందోళన చెందుతూ వుంటారు. కనుక, ముందుగా తన క్షేమ సమాచారాల సంగతి వారికి ఎరుకపరచటం మంచిది.

చిత్రసేనుడు యిలా అనుకుని మంత్రితో, "మీకు ధవళగిరినగరం గురించి తెలిసేవుంటుంది. దానికి రాజైన తారకేశ్వరుడికి, నేనిక్కడ క్షేమంగా వున్నట్టు వార్త పంపండి. తతిమ్మా విషయాలు వీలువెంట మాట్లాడదాం," అన్నాడు.

"చిత్తం! అలాగే కబురు పంపుతాను. కోశాధికారి, కోశాగారంలో ప్రస్తుతం వున్న ధనం గురించీ, ఇతర విలువైన వస్తువుల గురించీ లెక్కకట్టి ఒక జాబితా తయారు చేశాడు. ఆ జాబితా తీసుకుని ఆయనను యిక్కడికి రమ్మని సెలవా?" అని అడిగాడు మంత్రి.



# జరగని వివాహం

పట్టు వదలని విక్రమార్కుడు మరొకసారి చెట్టువద్దకు వెళ్ళి, శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ పట్టుదల అద్వితీయమైనది. కాని ఎలాటి సుఖం ఆశించి నీ విలాగ శ్రమపడుతున్నావో అర్థంకాకుండా ఉన్నది. నీవుకూడా ప్రమోదకుడిలాగా నిష్కారణంగా సుఖాన్ని దూరంచేసుకుంటున్నావని తోస్తుంది. శ్రమ తెలియకుండా ఉండగలందులకు నీకు అతని కథ చెబుతాను విను," అంటూ ఈవిధంగా చెప్పాడు:

గౌతమీనదీ ప్రాంతాన గల ఎత్తయిన కొండలమధ్య లోతైన లోయ ఒకటి ఉండేది. ఆ లోయలో కొద్ది ఇళ్లుమాత్రమే ఉండేవి. వాటిలో నివసించేవారికి బయటి ప్రపంచంతో ఏమీ సంబంధంలేదు. బయటి ప్రపంచానికి సూర్యోదయమయినాక మూడు ఘడియల

## బేతాళ కథలు



దాకా ఈ లోయలో సూర్యకాంతి కనిపించేదికాదు. అలాగే సూర్యాస్తమయంకూడా రెండు మూడు ఘడియలు ముందుగానే జరిగిపోయేది. సెలయేళ్ళతోనూ, చక్కని పూలచెట్లతోనూ, పళ్లచెట్లతోనూ ఈ లోయ భూలోక స్వర్గంలాగా ఉండేది.

ప్రమోదకుడు ఈ లోయలోనే పుట్టి పెరిగాడు. అతని తండ్రికి ఏలోటూ లేదు. ఆ తండ్రికి ప్రమోదకుడు ఒక్కడే కొడుకు. వాడు అయిదారేళ్ళ కుర్రవాడై ఉండగా ఒక నాడు తండ్రి వెంబడి లోయలోనుంచి ఒక కొండమీదికి ఎక్కాడు. వారు శిఖరాన్ని చేరుకున్నాక ప్రమోదకుడికి కొండ అవతల వేపున ఆకాశం తగిలేదాకా మైదానాలుండటం కనబడింది. వాడు ఆ మైదానాలను చూసి తన లోయకేసి చూస్తే ఎంతో చిన్నది అనిపించింది. "నాన్నా, ప్రపంచం ఇంత పెద్దదా?" అని వాడు తండ్రిని ఆశ్చర్యంగా అడిగాడు.

తండ్రి నవ్వి, "నాయనా, ప్రపంచమంతా నీకు అప్పుడే కనబడిందనుకున్నావా? అది అంతులేనిది. అందులో మహానగరాలున్నాయి, మహానదులున్నాయి, మహాసముద్రాలున్నాయి!" అన్నాడు.

ప్రమోదకుడు తండ్రినడిగి ఆనగరాలను గురించీ, అక్కడి జీవితం గురించీ, సముద్రం గురించీ, అందులో ప్రయాణించే నౌకలను గురించీ వివరంగా తెలుసుకున్నాడు. వివరాలు తెలుసుకుంటున్నకొద్దీ వాడికి ఈ విశాల ప్రపంచమంతా తిరగాలనీ, వింతలన్నిటినీ చూసి ఆనందించాలనీ గాఢమైన కోరిక కలిగింది. తండ్రి వర్ణించిన ప్రపంచపు వింతలను గురించి అస్తమానమూ కలవరిస్తూ కాలం గడిపాడు.

ప్రమోదకుడు పదహారేళ్లవాడయాడు. ప్రపంచ పర్యటన చేయాలనే కోరిక వాడిలో ఎప్పటికన్నా ఇంకా తీవ్రంగా ఉన్నది. ఈ సమయంలో వాడుండే లోయలోకి ఒక పెద్ద

మనిషి వచ్చాడు. ప్రమోదకుడు ఆ పెద్ద మనిషితో స్నేహంచేసి, ఆయనద్వారా ప్రపంచపు వింతలు మళ్లీ తెలుసుకుని, పట్టరాని ఉద్రేకంతో, "నేను నా జీవితమంతా ఇక్కడే గడిపాను. ఇంత విశాల ప్రపంచాన్ని ఎప్పుడు చూద్దామా అని నా ప్రాణం కొట్టుకుపోతున్నది," అన్నాడు.

"ఈ మహాపట్టణాలన్నీ తిరిగి, సముద్రాలు దాటితే నీకు ఎక్కువ ఆనందం కలుగుతుందనుకున్నావా? నీకు ప్రపంచంలో ఉండే వింతలే తెలిశాయిగాని అక్కడి బాధలను గురించి కొంచెంకూడా తెలిసినట్టులేదు. నేను ప్రపంచం చాలా చూశాను. మీ లోయలాంటి సుఖమయమైన ప్రదేశం నాకెక్కడా కనిపించలేదు. మహారాజుల ఇళ్లలోకూడా ఈ శాంతి సౌఖ్యాలు దొరకవు. అందుచేత నీకు కావలసింది ఆనందమే అయితే నువ్వీలోయను విడిచి ఎక్కడికీ పోకు," అన్నాడు పెద్దమనిషి.

"ఇంత విశాల ప్రపంచం ఉండి ఈ లోయలోనే జీవితమంతా గడపటం జీవించట మనిపించుకుంటుందా?" అన్నాడు ప్రమోదకుడు.

"వెర్రివాడా, ప్రపంచమంతా నువ్వు ఎలాగూ చుట్టిరాలేవు. ఒక్క ప్రపంచం



గురించే ఎందుకు విచారిస్తున్నావు? సృష్టి ఇంకా విశాలమైనది. తల ఎత్తి ఆ నక్షత్రాలను చూడు. మన ప్రపంచంకంటె అనేక కోట్ల రెట్లు పెద్దవి అయిన బ్రహ్మాండాలు సృష్టిలో ఉన్నాయి. వాటిలో ఎన్ని వింతలున్నాయో, ఎవరికీ తెలియదు. ఆ బ్రహ్మాండాలు మన కళ్ల ఎదటే ఉన్నప్పటికీ వాటిని చేరుకోలేంగద!" అన్నాడు పెద్దమనిషి. ఈ మాటలమూలంగా ప్రమోదకుడి అభిప్రాయం మారిపోయింది. అందుచేత తన తల్లిదండ్రులు చనిపోయినాకకూడా ఆ లోయ విడిచి ఎక్కడికీ పోక, ఇంటనే ఉండి తనకున్న ఆస్తిని చూసుకోసాగాడు.




ప్రమోదకుణ్ణి అందరూ ఎరుగుదురు, అతను అందరిని ఎరుగును. కాని అతను ఎవరితోనూ అంత కలుపుగోలుగా ఉండక, ఎప్పుడూ ఇంకొక ప్రపంచంలో ఉన్నవాడి లాగా కనబడటంచేత, వారంతా దూర దూరంగా ఉండేవాళ్లు. అతనికి వివాహ వయస్సు వచ్చింది. పెళ్ళాడాలంటే ఆ లోయలోనే కొందరు కన్యలున్నారు. కాని వారిలో ఒక్కరూ అతనికి నచ్చలేదు, అతను పెళ్లి తలపెట్టనూలేదు.

ఇంతలో ఒక సంఘటన జరిగింది. లోయ చివర నివసించే కులశేఖరుడనే ఆయన తన ఇంటిని పడగొట్టించి ఇంకా పెద్ద ఇల్లు కట్టించ సంకల్పించి, ఒక నెలపాటు ప్రమోదకుడి ఆతిథ్యం కోరాడు. ఎందుకంటే ప్రమోదకుడి ఇల్లు విశాలమైనది. అందులో అతనూ, ఇద్దరు నౌకర్లూ మాత్రం వున్నారు.

ప్రమోదకుడు కులశేఖరుణ్ణి తన ఇంట ఉండమన్నాడు. కులశేఖరుడు తన కుమార్తె అయిన మందాకినితోసహా ప్రమోదకుడి ఇంటికి వచ్చేశాడు.

ప్రమోదకుడు మందాకినిని అంత బాగా ఎరగడు. ఆమె అందగత్తె అనీ, ఎంతోమంది పెళ్లాడతానని వస్తే నిరాకరించిందనీ అతను విని ఉన్నాడు. ఇప్పుడామె తనకు సమీపంగా వచ్చేసరికి ఆమెలో ఉన్న ఆకర్షణ ప్రమోదకుడికి పూర్తిగా తెలిసివచ్చింది. ఆమె అందమే గాక, మాటతీరూ, పనులు చేసే పద్ధతీ కూడా అతనికి ఇంపుగా కనిపించాయి. ఇంతకాలానికి తాను పెళ్ళాడదగిన కన్య కనపడిందిగదా అని అతను సంతోషించాడు.

అయినా ప్రమోదకుడు తొందరపడక ఆమెపై తనకు కలిగిన సదభిప్రాయం కాలంతోపాటు మారిపోతుందేమోనని చూశాడు. రోజులు గడుస్తున్నకొద్దీ మందాకిని అతన్ని మరింతగా ఆకర్షించిందేగాని, ఆమెలో అతనికి ఎలాటి వెలితీ కనిపించ





లేదు. అతను అనుమానాలన్నిటినీ కట్టిపెట్టి కులశేఖరుడితో ఒకనాడు, "అయ్యా, మీకూ, మీ అమ్మాయికీ సమ్మతమయే పక్షంలో నేనామెను వివాహమాడతాను," అన్నాడు. కులశేఖరుడు మందాకినితో ఈ సంగతి చెప్పేసరికి, ఆమె తనకు అభ్యంతరం లేదన్నది.

ఇది జరిగిన కొద్దిరోజులకు ఒక సాయంకాలం వారిద్దరూ ఒక కొండదారి వెంబడి ఏదో మాట్లాడుకుంటూ నడుస్తూ ఉండగా ఒకచోట మంచి సువాసన పుష్పాలు కనిపించాయి. మందాకిని వెంటనే వెళ్లి వాటిని కోసి కొన్ని తలలో పెట్టుకుని, మరికొన్ని చేత పట్టుకుని ప్రమోదకుడివద్దకు వచ్చింది.

"పూలు చెట్టున ఉండగా చూస్తుంటేనే ఎక్కువ ఆనందంగా ఉంటుంది, కాదూ?" అన్నాడు ప్రమోదకుడు.

"నాకు అలాకాదు. చెట్టున అందమైన పూలు కనిపిస్తేచాలు నా ప్రాణం వాటికోసం కొట్టుకుపోతుంది. వాటిని కోసినదాకా నా ఆరాటం తగ్గదు," అన్నది మందాకిని.

మర్నాడు ఉదయం మందాకిని కనిపించగానే ప్రమోదకుడు, "నీతో ఒక్క విషయం చెప్పాలని నేను రాత్రి అనుకున్నాను. మనమిద్దరమూ ఎంతో స్నేహంగా ఉంటున్నాం. ఈ స్నేహం మనకు ఆనందం కలిగిస్తున్నది. మనం పెళ్లాడినంతమాత్రం చేత ఈ ఆనందం హెచ్చుతుందని నాకు తోచదు. నీ ఉద్దేశం ఏమిటి?" అని అడిగాడు.

వెంటనే మందాకిని అతని అభిప్రాయం మారినట్టు తెలుసుకుని, "నన్ను పెళ్ళాడమని నేను మిమ్మల్ని ఒత్తిడిచెయ్యబోవటం లేదు. పెళ్ళి ప్రస్తావన ఎత్తినది మీరేగాని నేనుకాదు. అయినదేదో అయింది. ఇక ఈ విషయం ఎత్తకండి," అన్నది.

ఆమెకు తనపై కోపం వచ్చిందని ప్రమోదకుడు తెలుసుకున్నాడు. కాని ఆ కోపం ఎలా పోగొట్టాలో అతనికి అర్థంకాలేదు.



మందాకిని తన తండ్రితో, "నాన్నా, నేను బాగా ఆలోచించుకుని, ప్రమోదకుణ్ణి పెళ్లాడ రాదని నిశ్చయించుకున్నాను. నువు మా పెళ్లివిషయం ఇక తీసుకురాకు!" అన్నది.

తరవాత కొద్దిరోజులకే కులశేఖరుడి కొత్త ఇల్లు తయారయింది. తండ్రి కూతుళ్లు వెళ్లి పోయారు. కాలక్రమాన మందాకిని ఎవరినో పెళ్లాడి వెళ్ళిపోయింది. ప్రమోదకుడు జీవి తాంతం బ్రహ్మచారిగానే ఉండిపోయాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, ప్రమోద కుడు ఇంత బుద్ధితక్కువగా తాను ప్రేమిం చిన స్త్రీని, తనను పెళ్ళాడటానికి ఒప్పుకున్న దాన్ని ఎందుకు పోగొట్టుకున్నాడు? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఇది ఏమంత గడ్డుప్రశ్న కాదు. ప్రమోదకుడికి కావలిసింది ఆనందమేగాని, అనుభవం కాదు. అనుభవం అవసరం లేకుండా ఆనందాన్ని పొందవచ్చు నని పదహారోఏట తెలుసుకుని ప్రపంచాన్ని చూసి రావాలన్న ప్రయత్నాన్ని మానుకు న్నాడు. పూలు కోసినప్పుడు మందాకిని అన్న మాటలను బట్టి అనుభవంద్వారా ఆనందం నశిస్తుందని తెలుసుకున్నాడు. మందాకిని ద్వారా తానూ, తనద్వారా మందాకినీ పొందు తూన్న ఆనందం పెళ్లిమూలాన నశిస్తుందని భయపడి అతను పెళ్లిప్రయత్నం మాను కున్నాడు. అయితే మందాకినికి కావలిసింది అనుభవమేగాని ఆనందం కాదు; అందుకే ఆమె చెట్లపై ఉండే పూలు చూసి తృప్తి పడక వాటిని కోసి తన సొంతం చేసుకునేది. అటువంటి మనిషి తాను ప్రేమించిన మనిషి స్నేహంద్వారా కలిగే ఆనందంతో ఎన్నడూ తృప్తిపడలేదు. అందుకే వారిద్దరికీ వివాహం జరగలేదు," అన్నాడు.

రాజుకీవిధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. —(కల్పితం)



# 3. గోమటేశ్వరుడు

పూర్వం ఒక రాజుకు ఇద్దరు కుమారులుండే వారట. తమ తండ్రి తదనంతరం రాజ్యం ఎవరికి రావాలన్న విషయంలో తగాదా పడి ఇద్దరూ ద్వంద్వయుద్ధం చేయగా, చిన్న వాడు గెలిచాడట. అయితే అతను తన ఓడిన అన్నకే రాజ్యం ఇచ్చాడట. ఈ ఉదారుడి విగ్రహమే ఈనాడు మనం చూసే గోమటేశ్వరస్వామి అని చెబుతారు.

మైసూరుకు 62 మైళ్ళ దూరంలో శ్రవణ బెళ్గొళ అనే గ్రామం ఉన్నది. ఈ గ్రామాన్ని అనుకుని రెండు కొండలు, చంద్రగిరి, ఇంద్రగిరి అన్నవి ఉన్నాయి. వాటిలో పెద్దదయిన ఇంద్రగిరిమీద ఈ 57 అడుగుల ఎత్తుగల ప్రతిమ ఉన్నది. దీనిని క్రీస్తుశకం 983 లో చాముండరాయలు ప్రతిష్ఠ చేయించాడు.

గోమటేశ్వరుడు జైనుల ఆరాధ్యులలో ఒకడు. శ్రవణ బెళ్గొళ కూడా జైన సంస్కృతికి ఒకప్పుడు గొప్ప కేంద్రంగా ఉండేది.

ఈ విగ్రహం జగత్ప్రసిద్ధి సంపాదించి ప్రపంచంలోని అద్భుత ప్రతిమలలో జమ కట్టబడింది. దీనిని ఇంద్రగిరిపైగల ఏకాండపు శిలనుంచి మలిచినట్టు కనిపిస్తుంది.

దీని తాలూకు కొన్ని కొలతలు: ఎత్తు సుమారు 57 అడుగులు; తల 6 అడుగులు; పాదం 9 అడుగులు; కాలి బొటనవేలు 2 అడుగుల 9 అంగుళాలు; భుజస్కంధం 26 అడుగులు.






# ప్రతిమలు

అయోధ్యానగరంలో దశరథ మహారాజు తన కొడుకైన రామచంద్రుడి పట్టాభిషేకానికి ఉత్తరువిచ్చాడు. ప్రయత్నాలు చురుకుగా సాగుతున్నాయి. ఛత్ర చామరాలూ, సింహాసనమూ సిద్ధంచేయబడ్డాయి. బంగారు కలశాలలో నీరు నింపారు. దర్భలు సిద్ధం చేశారు. తంతు నడిపించటానికి పురోహితుడైన వశిష్టుడు సిద్ధంగా ఉన్నాడు. ఈ సందర్భంలో తగిన నాటకం ప్రదర్శించమని నర్తకులకు కబురు వెళ్ళింది.

ఈ సమయంలో సీత చెలికత్తె, అవదాతిక అనేది, నారబట్ట దొంగిలించి తెచ్చింది. నటులకు వేషాలువేసే రేవాదేవి తనకు చిన్న అశోకచెట్టు మండ ఇమ్మంటే ఇవ్వలేదని కోపంవచ్చి ఆమె ఈపని చేసింది. అల్లరికి చేసిన దొంగతనమే అయినా అవదాతిక కంపించిపోతూ, నిజంగా దొంగలు ఎలా దొంగతనం చేస్తారో అనుకున్నది.

దాని కంగారు చూసి సీత అది చేసిన పని తెలుసుకుని, "దానిని వెంటనే ఆమెకిచ్చేసిరా," అన్నది. కాని అంతలోనే తానా బట్ట ధరిస్తే ఎలాఉంటుందో అని ఆమెకు అనిపించింది. ఆమె ఆ నారబట్ట ధరించింది. అవదాతిక సీత ఎదట పట్టటానికి అద్దం తెస్తూ, "అమ్మా, పట్టాభిషేకమనే మాట వినిపిస్తున్నది. ఎవరో రాజు కాబోతున్నారు," అన్నది. ఇంతలోనే మరొక దాసీ వచ్చి రాముడికి పట్టాభిషేకమని చెప్పింది. "మహారాజుగారికి స్వస్థతగా లేదా?" అని సీత ఆదుర్దాగా అడిగింది; మహారాజుగారే స్వయంగా రాజ్యాభిషేకం చెయ్యబోతున్నారని విని, "అయితే మంచిదే!" అన్నది.

ఇంతలో వారికి మంగళ తూర్యాలు వినిపించి, అంతలోనే నిలిచిపోయాయి. కారణమేమిటోనని రెండవ దాసి ఆశ్చర్యపడింది. "ఒకవేళ పట్టాభిషేకం ప్రస్తుతానికి ఆగిపో

యిందేమో, ఆస్థానాలలో అనుకోనివి ఎన్నో జరుగుతాయి!" అన్నది సీత. "రామ పట్టాభిషేకానంతరం మహారాజుగారు వనవాసం పోతారట," అన్నది దాసి. "అయితే అభిషేక జలం అశ్రువులు కడుగుకోవడానికే నన్నమాట!" అన్నది సీత.

రాముడు వచ్చాడు. "మంగళతూర్యాలు మోగాయి, పెద్దలు కనిపెట్టుకుని ఉన్నారు, నేను ఆసనంలో కూచుని ఉన్నాను, నా శిరస్సుపైన పవిత్రోదకం పొయ్యపోతున్నారు; ఇంతలో నాన్నగారు నన్ను పిలిచి, 'నాయనా, కొంచెం ఆగు,' అంటూ నన్ను పంపేశారు. రాజ్యభారం నెత్తిన పడలేదుగదా అని సంతోషించాను," అన్నాడతను. అతను సీతతో మంధర వచ్చి రాజుగారి చెవిలో ఏదో రహస్యంగా చెప్పిందనికూడా అన్నాడు. తర వాత అతను సీత కట్టిన నారబట్ట చూసి, తనకుకూడా అలాటిది కావాలని పట్టు బట్టాడు. మరొక నారబట్ట తెమ్మని సీత తన చెలికత్తెను రేవాదేవి వద్దకు పంపింది.

ఇంతలో, "అయ్యో, మహారాజుగారు!" అన్న ఆర్తనాదం వినిపించింది. కైకేయి మూలాన పట్టాభిషేకం ఆగిపోయిందనీ, ఆమె భరతుడి రాజ్యాభిషేకం కోరిందనీ, రాజుగారు మూర్ఛపోయారనీ దౌవారికుడు




తెలిపాడు. ఇంతలో లక్ష్మణుడు విలు బాణాలతో వచ్చి, "ఆ కైకేయిని ఇప్పుడే చంపేస్తాను!" అని ఆగ్రహంతో అన్నాడు.

"రాజ్యలోభంచేత హత్యలు చేస్తామా? ఎవరిని చంపుదాం—తండ్రిగారినా, తల్లి గారినా, ఏపాపమూ ఎరగని భరతుణ్ణా?" అని రాముడు అడిగాడు.

లక్ష్మణుడు కంట తడి పెడుతూ, "రాజ్యం రాలేదని నేను ఆగ్రహించలేదు. ఆ కైకేయి నిన్ను పద్నాలుగేళ్ళు అరణ్యా నికి పంపుతున్నది!" అన్నాడు.

"అందుకే మహారాజు మూర్ఛపోయి ఉంటారు!" అన్నాడు రాముడు. అతను



రాముడు సీతతో, "లక్ష్మణుడికి చెప్పి చూడు!" అన్నాడు. సీత చెప్పిచూసింది గాని, లక్ష్మణుడు తానుకూడా వనవాసం వచ్చి తీరాలని పట్టుబట్టి నారబట్ట ధరించాడు. ముగ్గురూ కలిసి రాజవీధిన పోతూంటె పౌరులు అటూ ఇటూ మూగారు. వారిని పక్కకు తొలగమంటూ లక్ష్మణుడు ముందు నడిచాడు. ఇంతలో దౌవారికుడు వచ్చి, "రాజకుమారా, మీరు వనవాసం వెళుతున్నారని విని మహారాజుగారు వస్తున్నారు, కొంచెం ఆగండి," అన్నాడు.

"వనవాసం వెళ్ళేవారు ఎవరికీ వీడ్కోలు చెప్పనవసరంలేదు," అని లక్ష్మణుడు రాముడితో అన్నాడు. అది నిజమేనంటూ రాముడు సీతా లక్ష్మణులతో ఆగకుండా వెళ్ళిపోయాడు.

సీతను నారబట్ట ఇమ్మని అడిగాడు. సీత అరణ్యానికి తానుకూడా వస్తానన్నది. ఆమె ఎంత చెప్పినా వినకపోవటం చూసి రాముడు లక్ష్మణుడితో, "ఆమెకు నువు చెప్పిచూడు," అన్నాడు. "ఆమె అన్నదానిలో తప్పేమీ లేదు," అన్నాడు లక్ష్మణుడు.

ఇంతలో సీత చెలికత్తె రేవాదేవి వద్ద నుంచి మరొక నారబట్ట తెచ్చింది. దానిని రాముడు తీసుకుని ధరించబోతూ ఉండటం చూసి లక్ష్మణుడు, "అన్నా, నీవద్ద ఏమి ఉన్నా నాకు సగం ఇస్తావే, ఆ నారబట్టను అంతా నీవే ధరించాలా. అంత స్వార్థం వద్దు, నాకు సగం ఇయ్యి!" అన్నాడు.

సీతారామలక్ష్మణులు వెళ్ళిపోయాక దశరథ మహారాజు చాలా మనోవేదన అనుభవించాడు. కౌసల్యా సుమిత్రలు ఆయనకు ఎన్నో ఉపచారాలు చేశారు. సుమంత్రుడు సీతారామ లక్ష్మణులను రథంలో శృంగబేరపురం వద్ద దించివచ్చి, దశరథుడితో వారు అరణ్యంలో ప్రవేశించిన సంగతి చెప్పాడు. ఆ సంగతి విని దశరథుడు సుమంత్రుడితో, "భరతుణ్ణి వెంటనే పిలి

పించు," అన్నాడు. ఇంతలోనే ఆయనకు మృత్యువు ఆసన్నమయింది. ఆయన కళ్లకు దిలీపుడూ, రఘువూ, తన తండ్రి అయిన అజుడూ కనిపించారు. "రామ సీతా లక్ష్మణులారా! నేను పోతున్నాను!" అంటూ ఆయన ప్రాణాలు వదిలాడు.

* * *

అయోధ్యకు కొద్ది దూరంలో ప్రతిమా శాల ఉన్నది. అందులో చనిపోయిన రాజుల ప్రతిమ లుంచుతారు. దశరథ మహారాజు చనిపోయాక ఆయన ప్రతిమనుకూడా అందులో ఉంచారు. ఆ రోజు మహారాణులు ప్రతిమాశాలను చూడవస్తున్నారని రాజ భవనంనుంచి కబురు రావటంవల్ల అంతా శుభ్రంచేసి అలంకరించి ఉంచారు.

ఆరోజునే భరతుడు మేనమామల ఇంటి నుంచి అయోధ్యకు వస్తున్నాడు. ఊరి వెల పలనే శత్రుఘ్నుడు పంపిన మనిషి అతని రథానికి ఎదురువచ్చి, భరతుడు కృత్తికా నక్షత్రం గడిచి రోహిణి ప్రవేశించేవరకూ అయోధ్యను ప్రవేశించరాదని పెద్దలు చెప్పి నట్టుగా విన్నవించాడు.

భరతుడు తన రథాన్ని ఉచితమైనచోట నిలిపించి చుట్టూ చూసేసరికి చెట్లనందుగా అతనికి ప్రతిమాశాల కనిపించింది. అతనికి



ఆ ప్రతిమాశాలను గురించి తెలియదు, తన తండ్రి మరణించిన సంగతికూడా తెలి యదు. అదేదో దేవాలయం అయి ఉంటుం దనుకుని అతను దానికేసి వచ్చాడు.

ప్రతిమాశాలలో ఎవరూ లేరు. నాలుగు విగ్రహాలు మాత్రం అలంకరించి ఉన్నాయి; అవి ఎవరో దేవుళ్ళవి అయి ఉంటాయని భరతుడనుకుని నమస్కరించాడు. ఇంతలో ప్రతిమాశాలను కనిపెట్టి ఉండే మనిషి వచ్చి, అవి దేవుళ్ల విగ్రహాలు కావనీ, గతించిన ఇక్ష్వాకు మహారాజులవనీ చెప్పాడు.

అవి తన పూర్వీకులవని తెలియగానే భర తుడు పరమానందం చెంది వారిని గురించి

వివరంగా చెప్పమని ఆ మనిషిని కోరాడు. ఆయన భరతుడికి దిలీప మహారాజునూ, రఘుమహారాజునూ, దశరథుడి తండ్రి అయిన అజమహారాజునూ చూపించి వారి ఖ్యాతిని వివరించాడు. వీరి పక్కన నాలుగో విగ్రహం ఉండటం చూసి భరతుడు కొంచెం కంగారుపడి దాన్నిగురించి ప్రశ్నించటానికి ధైర్యం చాలక మొదటి మూడు ప్రతిమలను గురించి మళ్ళీమళ్ళీ అడిగాడు. అలా మూడుసార్లు ముగ్గురినీ గురించి చెప్పించుకున్నాక భరతుడు ఆ మనిషితో, "అయ్యా, ఇక్కడ బతికున్నవారి విగ్రహాలు కూడా పెడతారా?" అని అడిగాడు. చచ్చిన వారివే పెడతారని ఆ మనిషి చెప్పాడు. "అయితే, సెలవు!" అంటూ భరతుడు వెనక్కు తిరిగాడు.

"కొంచెం ఆగండి. భార్యకు కానుకగా ప్రాణాలు వదిలిన దశరథ మహారాజును గురించి తెలుసుకోకుండా పోతున్నారేం?" అన్నాడు ఆ మనిషి.

"హా, తండ్రీ!" అని భరతుడు మూర్ఛపడిపోయాడు ఈ మాట వింటూనే. అప్పటికి ఆ మనిషికి ఈ కుర్రవాడు భరతుడయి ఉంటాడని బోధపడింది. భరతుడు మూర్ఛ తెలిసి ఆ మనిషిచేత జరిగినదంతా చెప్పించుకున్నాడు. సీతారామ లక్ష్మణులు



అరణ్యాలకు వెళ్ళిపోయారని తెలియగానే భరతుడు తిరిగి మూర్ఛపోయాడు.

ఆ సమయంలో మహారాణులు కౌసల్య, సుమిత్ర, కైకలు అక్కడికి వచ్చారు. సుమంత్రుడు వారి వెంట ఉన్నాడు. అతను మూర్ఛలో ఉన్న యువకుణ్ణి చూసి, అక్కడి మనిషిద్వారా భరతుడని తెలుసుకున్నాడు.

తరవాత భరతుడు స్పృహ తెలిసి కౌసల్యకూ, సుమిత్రకూ వందనాలు చేసి, తన తల్లి అయిన కైకేయిని నిందించాడు.

"నాయనా, నేనేం చేశాను?" అన్నది కైకేయి. భరతుడు తల్లిపైన వేయవలసిన నిందలన్నీ వేశాడు.

"నాయనా, నీకు రాజ్యాభిషేకం చెయ్యటానికి వశిష్ఠ వామదేవాదులు వస్తున్నారు," అని సుమంత్రుడు చెప్పేసరికి, భరతుడు, "అభిషేకం ఆ మహారాణికి చెయ్యండి. నేను అయోధ్యకు రాను, రాముడుండేచోటే నాకు అయోధ్య," అన్నాడు.

తరవాత కొద్దికాలానికే భరతుడు సుమంత్రుణ్ణి వెంటపెట్టుకుని రథంలో చిత్రకూటానికి చేరుకున్నాడు. రాముడి పర్ణశాల ఉంటున్నది అక్కడే. భరతుడు సుమంత్రుడితో, "దురాశాపరురాలైన కైకేయి కొడుకు భరతుడు వచ్చాడని రాముడికి విన్నవించు!" అన్నాడు.





"పెద్దలను నిందించటం తప్పు, నాయనా," అన్నాడు సుమంత్రుడు. భరతుడు తనను తానే ప్రకటించుకోదలచి బిగ్గరగా, "క్రూరుడూ, కృతఘ్నుడూ, అనాగరికుడూ, ధూర్తుడూ అయికూడా భక్తిశ్రద్ధలుగలవాడొకడు వచ్చాడు. వాడు లోనికి రావచ్చునా, లేక వచ్చినదారినే వెళ్లిపోవాలా?" అని కేకపెట్టాడు.

పర్ణశాలలో ఉన్న రాముడీ కేక విని, "గంభీరంగా, నాన్నగారి కంఠధ్వనిలాగున్నది. ఎవడో అప్పుడు వచ్చాడు," అంటూ చూసిరమ్మని లక్ష్మణుణ్ణి పంపాడు. లక్ష్మణుడు బయటికి వచ్చి భరతుణ్ణి చూసి రాముడికి ఈ సంగతి చెప్పాడు. భరతుణి లోపలికి తీసుకురావటానికి రాముడు సీతను పంపాడు. భరతుడు లోపలికి వచ్చి రాముణ్ణి గాఢాలింగనం చేసుకున్నాడు.

భరతుడు తానుకూడా రాముడితోపాటు అరణ్యంలో ఉండిపోతానన్నాడు, కాని రాముడు సమ్మతించలేదు; "నేను అహంకారంచేతగాని, భయంచేతగాని, మతి చెడిగాని అరణ్యానికి వచ్చాననుకున్నావా? నాయనగారి ఆజ్ఞ ననుసరించి వచ్చాను. నువుకూడా అలాగే ఆయన ఆజ్ఞప్రకారం రాజ్యపాలన చెయ్యి," అన్నాడు.

భరతుడు ఇందుకు ఎంతమాత్రమూ ఒప్పలేదు. చివరకు అతను రాముడి ఆంక్షను ధిక్కరించలేక, "నీ వనవాసానంతరం నీ రాజ్యం నీవు తీసుకునేపక్షంలో నేను అంతదాకా రాజ్యపాలన చెయ్యటానికి ఒప్పుకుంటాను. రాజ్యాభిషేకం నేను చేసుకోను, నీ పాదుకలకే చేస్తాను," అన్నాడు.

రాముడు ఇందుకు సమ్మతించి భరతుడికి తన పాదుకలనిచ్చి, అరోజే అయోధ్యకు పంపించేశాడు.

* * *

ఒకనాడు సీతారాములు పర్ణశాలలో కూచుని మరునాడు దశరథమహారాజు

ఆబ్దికం గురించి ఆలోచిస్తూ ఉండగా, రావణుడు తపస్వి వేషంలో అక్కడికి వచ్చి, "లోపల ఎవరు? నేను అభ్యాగతిని!" అని కేక పెట్టాడు. తన తమ్ముడైన ఖరుణ్ణి రాముడు చంపిఉన్నందుకు ప్రతీకారంగా సీతను ఎత్తుకుపోయే ఉద్దేశంతో రావణుడు మాయారూపంలో వచ్చాడు.

రాముడు అతన్ని పర్ణశాలలోకి ఆహ్వానించి కూచోబెట్టి, "మహర్షీ, శ్రాద్ధానికి ప్రధానమైనవేవి?" అని అడిగాడు. దానికి రావణుడు, "గ్రాసాలలో దర్భా, విత్తులలో నువ్వులూ, పప్పులలో మినుమూ, చేపలలో రొయ్యా, జంతువులలో గోవుగాని, ఖడ్గమృగంగాని, బంగారులేడిగాని ముఖ్యం. అయితే బంగారు లేళ్ళు ఇక్కడ దొరకవు; అవి హిమాలయాలలో గంగాజలం తాగుతూ నివసిస్తున్నాయి," అన్నాడు.

అంతలోనే రాముడికి దూరాన బంగారు లేడి కనిపించింది. దానిని పట్టటానికి లక్ష్మణుణ్ణి పంపుదామంటే సమయానికి అతను ఎవరో మునులను చూడబోయాడు. అందుచేత రాముడు దానిని పట్టి తేవటానికి బయలుదేరాడు. రావణుడు చూస్తూండగానే లేడి రాముడి బాణాలకు అందక పొదల దూరి అదృశ్యమయింది.




అప్పుడు రావణుడు తన నిజస్వరూపంలో సీతకు కనబడి ఆమెను ఎత్తుకుని బయలుదేరాడు. సీత ఎలుగెత్తి కేకలు పెట్టింది. అది విని జటాయువు అనే పక్షి రావణుడితో తలపడింది. రావణుడు దాని రెక్కలను ఖండించి, వెళ్ళిపోయాడు.

*  *  *

అక్కడ అయోధ్యలో భరతుడికి సీతాపహరణం గురించీ, రామ లక్ష్మణులు సుగ్రీవుడితో సఖ్యంచేసి, వాలిని సంహరించటం గురించీ తెలిసింది. సీతను రావణుడు అపహరించాడన్న వార్త భరతుడికి గొడ్డలిపెట్టు అయింది. అతను కోపంతో తన తల్లి అయిన

కైకేయి వద్దకు వెళ్ళి, "నీకొక శుభవార్త తెచ్చాను. నీ మూలాన రాముడు అడవి పాలు కాగా, మహాపతివ్రత సీత అపహరించబడింది. నీకు తృప్తి అయిందా? నిన్ను కోడలుగా తెచ్చుకున్న కారణంగా మా వంశం మరొక కోడలిని పోగొట్టుకున్నది," అన్నాడు.

అతని సూటిపోటి మాటలు ఇక సహించలేక కైకేయి భరతుడితో దశరథుడికి పుత్రశోకం కలిగేలాగు శాపం ఉండటం గురించి చెప్పింది. "ఆ శాప ప్రభావంవల్ల నేను రాముడి వనవాసం కోరాను," అన్నదామె.

"నా వనవాసం కోరలేకపోయావా?" అన్నాడు భరతుడు.

"నీవు మొదటినుంచీ దూరంగానే ఉంటివిగదా!" అన్నది కైకేయి.

"పధ్నాలుగేళ్ళు ఎందుకు కోరావు?" అన్నాడు భరతుడు.

"పధ్నాలుగు రోజులనబోయి, నోరుజారి పధ్నాలుగేళ్ళు అన్నాను, నాయనా!" అన్నది కైకేయి. ఈ విషయాలు అందరికీ తెలుసునని భరతుడు తెలుసుకున్నాడు. "అమ్మా, నీవల్ల తప్పులేదు. నీతో పరుషంగా మాట్లాడినందుకు క్షమించు," అన్నాడతను.

* * *

రాముడు రావణాసురుణ్ణి చంపి, సీతను చెర విడిపించి, లంకకు కొత్తగా రాజైన విభీషణుడితో వస్తున్నట్టు జనస్థానంలో ఉండే ఆశ్రమవాసులకు తెలిసింది. వారు స్వాగత యత్నాలు చేశారు. ముని పత్నులు సీతను ఎంతో ఆదరించారు. భరతుడూ, మహారాజులూ పెద్ద సేనతో సహా అక్కడికి చేరుకున్నారు.

రాముడి కష్టాలు గడిచిపోయి, అందరూ సంతోషంగా ఒకచోట చేరారు. అక్కడే రాముడికి మునులు రాజ్యాభిషేకం చేశారు. తరవాత అందరినీ అయోధ్యకు తీసుకుపోవటానికి పుష్పక విమానం వచ్చింది.





# ఆకతాయి

పూర్వం జర్మనీలో టిల్ అని ఒక ఆకతాయి వాడుండేవాడు. ఎప్పుడూ అబద్ధాలాడటమూ, ఎవరినో ఒకరిని ఏడిపించటమూ వాడికి చిన్నతనం నుంచీ అలవడ్డాయి. అయితే తప్పుడు పనులు చెయ్యటంలోకూడా వాడికి గల తెలివితేటలు చూసి అందరూ వాణ్ణి మెచ్చుకునేవారు.

పసితనం నుంచికూడా అల్లరి చెయ్యటం తప్ప వాడు మరొక విద్య ఏదీ అభ్యసించ లేదు. తండ్రి వాడికి వ్యవసాయపు పనులు నేర్పుదామనుకున్నాడు, తల్లి వాడిచేత కొన్ని ఇంటిపనులైనా చేయించుకుందామను కున్నది. కాని వాడు ఇద్దరికీ అందకుండా తిరిగేవాడు.

టిల్ పదహారో ఏట వాడి తండ్రి కాస్తా చనిపోయాడు. టిల్ తల్లికి భర్తపోయిన దుఃఖంతోబాటు తరగని దారిద్ర్యంకూడా దాపరించింది.

"ఇప్పుడు మన గతి ఏమిటి? నువు ఆకతాయిగా తిరగక ఏదో ఒక వృత్తివిద్య నేర్చుకుని ఉన్నట్టయితే మనకీ దుర్గతి రాక పోను!" అని తల్లి లబలబలాడింది. అయితే టిల్‌కు మటుకు ఈగ కుట్టి నట్టయినా లేదు.

ఆఖరుకు ఇంట్లో ఒక చిల్లిగవ్వగాని, ఒక చిన్న రొట్టెతుంపుగాని లేని పరిస్థితి ఏర్పడింది.

"ఎలాగైనా రొట్టెలు సంపాదించకపోతే మనిద్దరికీ ఇక పస్తే. పాపిష్టిదాన్ని, ఈరోజు చూడటానికే బతికి ఉన్నాను!" అంటూ ముఖానికి చెంగు అడ్డం పెట్టుకుని తల్లి ఘోరున ఏడ్చింది.

"ఎందుకమ్మా ఏడుస్తావూ? నీకు కావలిసింది రొట్టెలేగద? తెస్తానుండు!" అంటూ టిల్ నేరుగా బస్తీకి వెళ్ళి, ఒక మంచి రొట్టెల దుకాణం ప్రవేశించి, దుకాణ

టి. రాజేశ్వరరావు



దారుతో, "ఏమయ్యా, మా జమీందారుగారు ఈ ఊరి సత్రంలో మజిలీ చేశారు. పై మజిలీకి తీసుకుపోవటానికి సిబ్బంది కంతా సరిపడే రొట్టెలు పట్టించుకు రమ్మన్నారు. బంగారు కాసు విలవకు రొట్టెలు ఎంచి నా వెంట మీ మనిషితో పంపుతావా? సత్రంలో డబ్బిప్పిస్తాను!" అన్నాడు.

రొట్టె లమ్మేవాడు తన పంట పండిం దనుకుని, టిల్ ముందు వంగి వంగి సలాములు చేసి, తన నౌకరుచేత ఒక తట్ట నిండా రొట్టెలు పేర్పించి, టిల్ వెంట పంపాడు. ఇద్దరూ సత్రానికి వెళ్లే దారిలో టిల్ నౌకరుతో, "తట్ట వంకరగా పట్టుకున్నావు. రొట్టెలు కింద పడిపోగలవు జాగర్త!" అన్నాడు. నౌకరు తట్టను సరిచేద్దామనుకుని పక్కకు వంచాడు. ఒక రొట్టె కింద పడింది.

"చూశావా? నేను చెబుతూనే ఉన్నాను. ఈ కింద పడిన రొట్టె మా జమీందారుగారి కళ్ల పడిందంటే నిన్నూ, నన్నూకూడా నార తీసేస్తారు. వెంటనే దీన్ని తీసుకుపోయి మంచిరొట్టె తీసుకురా. నేనిక్కడే ఉంటాను," అన్నాడు టిల్.

తప్పంతా తనదే అనుకుని దుకాణం నౌకరు కింద పడిన రొట్టెతోసహా దుకాణానికి పరిగెత్తాడు. వాడు అలా కనుచాటు కాగానే టిల్ రొట్టెల గంప ఎత్తుకుని వేగంగా తన గ్రామానికి వచ్చేశాడు.

"చూశావా, అమ్మా! వెన్నలాటి తెల్ల రొట్టెలు. మనం రెండు వారాలపాటు తిన వచ్చు. కొన్ని అమ్ముకోవచ్చు కూడానూ," అన్నాడు వాడు తల్లితో.

కాని ఆ రొట్టెలు ఎల్లకాలం రావుగద. మళ్లీ తిండిలేని పరిస్థితి ఏర్పడింది. "ఏపనీ చెయ్యలేని సోమరిపోతువు దాపరించావు గదరా!" అని తల్లి కంట తడిపెట్టింది.

"నువ్వూరుకో, అమ్మా. నేను రాజధానికి వెళ్లి ఏదైనా పని చూసుకుంటాను," అన్నాడు టిల్. వాడు రాజధాని నగరంలో

ఒక రొట్టెలు చేసేవాడివద్దకు వెళ్ళి, అతని కింద నౌకరుగా కుదిరి రెండు రోజులు పని చేశాడు. మూడోనాడు దుకాణదారు పొరుగూరు పోతూ, "నేను రావటం ఆలస్యమవుతుంది. రేపటి రొట్టెలు నువే కాల్చాలి," అని టిల్‌తో చెప్పాడు.

"అలాగే కాలుస్తాను. కాని ఏం కాల్చమన్నారు?" అని టిల్ అడిగాడు.

"ఏం కాల్చాలంటా వేమిటి? గుడ్లగూబలూ, కోతులూ కాలుస్తావా? ఏం కాల్చాలో నీకు తెలీదూ? అధికప్రసంగం చెయ్యకు," అని యజమాని కోప్పడ్డాడు.

టిల్ వంటశాలలోకి వెళ్ళి పిండిఅంతా గుడ్లగూబల ఆకారంలోనూ, కోతుల ఆకారంలోనూ తయారుచేసి వాటిని కాల్చాడు. మర్నాడు యజమాని తిరిగి వచ్చేసరికి రొట్టెలన్నీ గుడ్లగూబల రూపంలోనూ, కోతుల రూపంలోనూ ఉన్నాయి.

"దొంగ వెధవా, ఏం పనిరా యిదీ?" అన్నాడు యజమాని.

టిల్ అమాయికపు మొహం పెట్టి, "మీరు గుడ్లగూబలనూ, కోతులనూ కాల్చమన్నారు గదా అని అవే కాల్చాను," అన్నాడు.

యజమాని టిల్ దవడలు రెండూ వాయగొట్టి, "నీ మొహం నాకు మళ్లీ



చూపించకు. అయితే నా పిండికి సొమ్మిచ్చి మరీ వెళ్లు!" అన్నాడు.

"ఆ రొట్టెలను నాకిచ్చేస్తే పిండికి డబ్బిస్తాను," అన్నాడు టిల్. వాడికి యజమాని రెండు రోజుల జీతం బాకీ ఉన్నాడు. దానికి తన జేబులో ఉన్న చిల్లర డబ్బులు జతచేసి యజమానికిచ్చి తాను కాల్చిన బొమ్మరొట్టెలను తీసుకుని టిల్ పెద్ద చర్చి సమీపానికి వెళ్లాడు.

ఆనాడు ఒక పుణ్యదినం. టిల్ చర్చి వాకిట నిలబడి, "గుడ్లగూబ కావాలా? కోతి కావాలా?" అని వచ్చేపోయే జనాన్ని అడగ సాగాడు. వాడమ్మే వింతరొట్టెలు చూసి

అందరూ విరగబడి నవ్వారు. చాలామంది వాటిని కొన్నారుకూడా. త్వరలోనే రొట్టెలు ఖాళీ అయి టిల్ జేబులు చిల్లర డబ్బులతో నిండాయి. వాడా డబ్బు తీసుకుని ఇంటికి వెళ్లాడు. తల్లి కొడుకులు పండగకూడా చేసుకున్నారు.

* * *

టిల్‌కు ఏపనీ చేతకాకపోయినా జనాన్ని మోసగించి డబ్బులు సంపాదించే మార్గాలు చాలా తెలుసు. ఇలా సంపాదించిన డబ్బుతో వాడు ఒక గుర్రం కొని దానిమీద ఎక్కి జర్మనీ అంతటా తిరుగుతూ జనాన్ని రకరకాలుగా ఏడిపించుకుతిన్నాడు.

ఒకరోజు వాడొక పట్టణం చేరి సంతకు వెళ్లాడు. అక్కడికి చాలామంది ఆడవాళ్ళు పాలు అమ్ముకోవటానికి వచ్చారు. టిల్ ఒక పెద్ద గంగాళం తెచ్చి ఒకచోట ఉంచి, "దీని నిండా పాలు కావాలి. ఇతరులిచ్చే ధరకన్న కాస్త ఎక్కువే ఇస్తాను," అని పాలవాళ్లతో అన్నాడు. ఒక్కొక్క పాల మనిషీ వచ్చి పాలను గంగాళంలో కుమ్మరించి డబ్బు అడగ నారంభించింది.

"గంగాళం నిండేదాకా ఎవరికీ డబ్బివ్వను," అన్నాడు టిల్.

చివరకు గంగాళం నిండింది. టిల్ పాలవాళ్లతో, "ఇవాళకు నాకీ పాలు చాలు. మీ



డబ్బులు లెక్కచూసి రెండువారాల తర వాత ఇస్తాను. అంతదాకా ఆగటం ఇష్టం లేనివాళ్లెవరైనా ఉంటే వాళ్ల పాలు వాళ్ళు తీసుకోవచ్చు," అన్నాడు.

వెంటనే పాలవాళ్లందరూ ఎగబడి తమ తమ వంతు పాలు గంగాళం నుంచి తీసు కోవటానికి ప్రయత్నించారు. చిన్న దొమ్మీ అయింది. ఎక్కువ పాలు నేలపాలయాయి. ఆ అడావుడిలో టిల్ జారుకున్నాడు.

* * *

ఒకనాడు టిల్ వద్ద ఉన్న డబ్బంతా అయిపోయి, తన గుర్రాన్ని అమ్ముకోవలిసిన గతి వచ్చింది. కాని వాడికి గుర్రాన్ని అమ్మటం ఏమీ ఇష్టంలేదు. అందుచేత గుర్రాన్ని అమ్మకుండానే డబ్బు సంపాదించ టానికి ఒక యుక్తి చేశాడు.

వాడు ఒక సత్రానికి వెళ్ళి అక్కడి గుర్రాల కొట్టంలో తన గుర్రాన్ని కట్టేసి, రచ్చసావిడికి వెళ్ళి అక్కడ చేరినవారితో, "నా దగ్గిర ఒక విచిత్రమైన గుర్రం ఉన్నది. అటువంటి గుర్రం ప్రపంచంలో ఎక్కడా ఉండదు. దాని తోక ఉండవలిసినచోట తలా, తల ఉండవలిసినచోట తోకా ఉన్నాయి. అయ్యల్లారా, ఒక్క చిన్న రాగి కాసు చొప్పున ఇచ్చారంటే మీకీ అద్భుత మైన గుర్రాన్ని చూపిస్తాను. సంకోచించ






కండి, కాసులిచ్చి ఈ అద్భుతమైన గుర్రాన్ని చూడండి!" అని ఎలుగెత్తి చెప్పాడు.

వింత చూడాలని అందరికీ సరదాగానే ఉంటుంది. అందుచేత జనం ఈ వింత గుర్రాన్ని చూడటానికి టిల్ చుట్టూ మూగి రాగికాసులు వాడి టోపీలో వేశారు. వాటితో వాడి టోపీ నిండిపోయింది. తరవాత వాడు ఆ జనాన్ని సత్రానికి తీసుకుపోయి, అక్కడి కొట్టంలో కట్టిఉన్న తన గుర్రాన్ని చూపాడు. ఆ గుర్రంలో వాళ్ళు చూసిన వింత ఏమిటంటే కట్టుతాడు దాని మెడకు కట్టి ఉండటానికి బదులు తోకకు కట్టి ఉన్నది!

కాసులిచ్చినవారిలో కొంతమందికి కోపం వచ్చింది, కాని ఎక్కువమంది టిల్ యుక్తికి విరగబడి నవ్వటం చూసి వాళ్ళు కూడా నవ్వు ఆపుకోలేకపోయారు. టిల్ దేహశుద్ధి కాకుండా తప్పించుకున్నాడు.

* * *

ఇంకొకసారి టిల్ తన గుర్రం ఎక్కి ఒక నగరాన్ని చేరుతూండగా నగరం వెలపల వాడికి పన్నెండుమంది గుడ్డి బిచ్చగాళ్ళు కనిపించారు. వాడు వాళ్లను పలకరించి, "పాపం, మీరిలా అడుక్కుతింటూ ఎంతకాలంగా కష్టపడుతున్నారో, కొద్దిరోజులపాటు మంచి వసతి గృహంలో హాయిగా ఉండకూడదూ?" అన్నాడు.

"మాకంత అదృష్టమా, బాబూ? మమ్మల్ని వసతి గృహంలో ఉంచి తిండి పెట్టే ధర్మదాత ఏడీ?" అని గుడ్డి బిచ్చగాళ్లు అన్నారు.

"ధర్మం చెయ్యటంకంటె పుణ్యం మరొకటి ఉన్నదా? నేనే మీకు ధర్మంచేస్తాను. ఇవిగో, మీ పన్నెండుమందికీ పన్నెండు బంగారు కాసులు! వీటిని తీసుకుపోయి నగరంలో ఉండే గొప్ప వసతి గృహంలో వీలయినన్ని రోజులుండండి!" అంటూ కాసులు చప్పుడు చేశాడు.

టిల్ ఆ కాసులను ఏ ఒక్క బిచ్చగాడి చేతిలోనూ పెట్టలేదు. కాని వాళ్లు గుడ్డి వాళ్లు కావటంచేత ఆ సంగతి గ్రహించలేక, తమలో ఎవరో ఒకరికి పన్నెండు బంగారు కాసులు అందాయనుకున్నారు.

తరవాత ఆ బిచ్చగాళ్లు నగరం ప్రవేశించి దారివెంట జనాన్ని అడుగుతూ నగరంలో ఉన్న వసతి గృహాలన్నిటిలోకీ మంచిదానికి వెళ్లారు. వసతిగృహ యజమాని వాళ్లని చూసి, "ఏయ్, ఇది బిచ్చగాళ్లుండే చోటు కాదు, పదండి, పదండి!" అని అదలించాడు. కాని వాళ్లు, "ఏమయ్యోయ్, మేం బిచ్చానికి రావటంలేదు. మాదగ్గిర పన్నెండు బంగారు కాసులున్నాయి. మా తిండికీ తాగుడుకూ అయే ఖర్చు ఇచ్చుకుంటాంలే!" అన్నారు. పన్నెండు బంగారు కాసులున్నాయని వినగానే వసతిగృహ యజమాని వారిని ఎంతో మర్యాదతో లోపలకు తీసుకుపోయి వారికి గదులు చూపించి, అన్ని సౌకర్యాలూ అమర్చాడు

ఒక వారంపాటు ఆ బిచ్చగాళ్లు సుష్టుగా తిన్నారు, మెత్తని పక్కలమీద పడుకున్నారు. వారికి రాజోపచారంగా జరిగిపోయింది. తరవాత యజమాని వారివద్దకు వచ్చి, "అయ్యలారా, ఇక మీరు మీడబ్బు నాకిచ్చి



మీదారిన మీరు వెళ్లవచ్చు. ఒక్కొక్కరికీ ఒక్కొక్క బంగారు కాసు విలవ ముట్టింది," అన్నాడు.

బిచ్చగాళ్లు నిట్టూర్చి, "ఆ పుణ్యాత్ముడి దయవల్ల వారం రోజులు సుఖపడ్డాం. మనకూ సుఖానికీ ఇవాళతో రుణం తీరిపోయింది," అన్నారు. కాని వారిలో ఏ ఒకడూ కాసులు తీసి వసతిగృహ యజమానికివ్వలేదు.

"డబ్బు! డబ్బు! ఎంత సేపు చేస్తారు?" అని యజమాని తొందరచేశాడు.

"డబ్బు ఎవరిదగ్గిర ఉన్నదో, ఇచ్చెయ్యండి!" అని కొందరు బిచ్చగాళ్లు

అన్నారు. తరవాత, నాదగ్గిర లేదంటే, నా దగ్గిర లేదని పన్నెండుమందీ అనేశారు.

తాను మోసపోయినట్టు తెలిసి వసతి గృహ యజమాని మండిపడి బిచ్చగాళ్లను తిట్టాడు. "అయ్యా, ఇది నిజంగా మాతప్పు కాదు. ఆ పెద్దమనిషి ఎవడో మమ్మల్ని బాగా మోసగించాడు," అన్నారు బిచ్చగాళ్లు భయంతో వణికిపోతూ.

"అదంతా నాకు తెలీదు. మీరు నాకు డబ్బిస్తారా, జైలుకు నడుస్తారా?" అన్నాడు వసతిగృహ యజమాని. ఆయన వారందరినీ బయటికి గెంటి పశువుల కొట్టంలో పెట్టి తాళం వేశాడు.

ఆ సమయానికి టిల్ అక్కడికి వచ్చాడు. వాడు తన బిచ్చగాళ్లపైన ఒక కన్నువేసే ఉంచాడు. వాడు వసతిగృహ యజమానితో "ఇదేమిటి, ఈ మనుషులను ఇలా బందెల దొడ్డిలో పెట్టావు? అతిథులను ఇలాగేనా చూసేది?" అన్నాడు.

"వాళ్ళు అతిథులా? దొంగముండా కొడుకులు! నన్ను మోసం చేశారు!" అంటూ యజమాని జరిగిన సంగతి టిల్‌కు చెప్పాడు.

"పాపం, వాళ్ళివ్వవలిసిన డబ్బు మరెవరైనా ఇచ్చే పక్షంలో ఆ పన్నెండుమంది గుడ్డివాళ్ళనూ విడిచిపుచ్చుతావా?" అని టిల్ అడిగాడు.



"నాకు కావలిసింది డబ్బు. ఈ బిచ్చ గాళ్ళు నాకెందుకు?" అన్నాడు వసతిగృహ యజమాని.

"డబ్బిచ్చేవాడు దొరుకుతాడేమో చూస్తాను. ఈ మహానగరంలో ధర్మదాతలే ఉండరా?" అంటూ టిల్ బయలుదేరి ఒక మతగురువు వద్దకు వెళ్ళి, "అయ్యా, ఒక అభాగ్యుడికి సైతాను సోకి నానాబాధా పెడుతున్నది. దాన్ని వదలగొట్టి పుణ్యం కట్టుకోగలరా?" అని అడిగాడు.

"అలాగే, నాయనా. వీలు చూసుకుని ఆ మనిషిని నా దగ్గిరికి తీసుకురా!" అన్నాడు మతగురువు.

టిల్ వసతి గృహానికి తిరిగి వచ్చి యజమానితో, "అదృష్టవశాత్తూ ఒక మతగురువు దొరికాడు. బిచ్చగాళ్ళు నీకివ్వవలిసిన మొత్తం ఆయన ఇస్తాడట. నా మాట నమ్మకం లేకపోతే నీ భార్యను ఆయన వద్దకు నా వెంట పంపు." అన్నాడు.

వసతిగృహ యజమాని భార్య టిల్ వెంట మతగురువు వద్దకు వెళ్ళింది. టిల్ ఆయనతో, "అయ్యా, నేను చెప్పిన పెద్దమనిషి భార్యే ఈమె. ఆ పెద్దమనిషి కోరిక తీరుస్తారు గద!" అన్నాడు.

"ఏమమ్మా, నీ భర్తను ఏమీ విచారించ వద్దని చెప్పు. భయపడ వలసిందేమీ లేదు.





అలాటివాళ్లకు సహాయపడటంకన్న ధర్మం ఏమున్నది?" అన్నాడు మతగురువు వసతి గృహ యజమాని భార్యతో.

ఆమె ఈ మాటలు విని సంతోషించి ఇంటికి వెళ్లి తన భర్తతో, "ఆ మతగురువు ధర్మం చేస్తానని నాతో అన్నారు!" అన్నది. ఆమె భర్త గుడ్డివాళ్లను విడిచిపుచ్చాడు. తరవాత ఆయన మతగురువువద్దకు వెళ్లి తనకు రావలిసిన పన్నెండు బంగారు కాసులూ రాబట్ట యత్నించాడు. ఇద్దరూ కొంతసేపు ఘర్షణ పడ్డాక టిల్ చేసిన మోసం బయటపడింది. కాని అప్పటికే బిచ్చగాళ్ళూ, టిల్ కూడా చెయ్యిదాటిపోయి ఉండటంచేత వసతిగృహ యజమాని ఏమీ చేయలేకపోయాడు.

* * *

టిల్ చేసే దుండగాలు ఎంతకాలమని సాగుతాయి? ఒకసారి వాణ్ణి అధికారులు పట్టుకుని, విచారణ జరిపి, మరణశిక్ష విధించారు. ఉరితీసే ఘడియ వచ్చేసరికి ఉరికంబం వద్ద జనం గుంపులు గుంపులుగా గుమికూడారు. చాలామందికి టిల్ అలా చావటం ఏమీ ఇష్టంలేదు.

టిల్‌ను తెచ్చి ఉరికంబం ఎక్కించి, ఒక కొత్త తాడుకు ఉచ్చుపెట్టి దాన్ని అతని మెడకు తగిలించారు. ఉరితీసేవాడు టిల్‌తో, "ఏమైనా చెప్పుకుంటావా?" అని అడిగాడు.

టిల్ అక్కడ చేరిన ప్రజలను ఉద్దేశించి, "నేను కొద్దిసేపట్లో చనిపోబోతున్నాను, నాకీ శిక్ష తగినదే, ఎందుకంటే నేను చాలా పాపాలు చేశాను. కాని, మహాజనులారా, నాకు ఒకే ఒక కోరిక ఉన్నది. నాకు మీరు ప్రాణదానం చెయ్యవద్దు, డబ్బూ దసకమూ ఇవ్వవద్దు. మీకు కొంత ఖర్చు తగ్గించాలనే నా ఉద్దేశం!" అన్నాడు.

నగరపాలకులు తమలో తాము సంప్రతించుకుని, "వీడు ఖర్చు తగ్గించే పక్షంలో వీడి కోరిక మనం ఎందుకు కాదనాలి?"



అనుకుని, అతని ఆఖరుకోరిక నెరవేరుస్తామని మాట ఇచ్చారు. కాని ఆ కోరిక మూలంగా మరణదండన రద్దు కావటం జరగగూడదనీ, ప్రభుత్వ ఖర్చు నిజంగా తగ్గాలనీ అన్నారు.

"మీకు ఎంతో కృతజ్ఞుణ్ణి. నా కోరిక ఏమంటే, నన్ను ఉరి తీయటానికిగాను మీకు దమ్మిడీ ఖర్చుకూడా కాకూడదనే. ఈ కొత్త తాడు ఎందుకు ఖర్చుచేస్తారు. నాకు ఒక పాతతాడు తెచ్చి ఇవ్వండి. దానితో నన్ను నేనే ఉరి వేసుకుంటాను. ఉరి వేసే మనిషికిచ్చే డబ్బుకూడా మిగులుతుంది," అన్నాడు టిల్. అందరూ తృప్తిపడ్డారు.

టిల్ మెడకు ఉన్న ఉచ్చు తీసి, వాణ్ణి ఉరికంబం నుంచి దిగి రానిచ్చారు, వాడి చేతికి ఒక పాత తాడు ఇచ్చారు. వాడు పుర పాలకులతో, "కృతజ్ఞుణ్ణి! ఈ తాటితో నాకు విరామం దొరకగానే, అంటే చెయివీలు చూసుకుని, ఉరి పోసేసుకుంటాను," అంటూ జనంలో పడి జారుకున్నాడు. వాడి యుక్తికి చాలామంది సంతోషించారు.

*　　*　　*

టిల్ ఖ్యాతి జర్మనీ దాటి ఇతర దేశాలకు కూడా పాకింది. పోలెండు దేశపు రాజు హాస్య ప్రియుడు. ఆయనవద్ద ఇద్దరు విదూషకులుండేవారు. ఆయన టిల్ చాతుర్యం గురించి విని, తన విదూషకులతో పోటీచేసి గెలవమని టిల్‌కు ఆహ్వానం పంపాడు.

ఆ ప్రకారమే టిల్ పోలెండు వెళ్లి రాజుగారిని దర్శించాడు. ఆయన వెంట ఆయన విదూషకులిద్దరూ ఉన్నారు. వారు టిల్‌ను సులువుగా జయిస్తారని రాజుగారి ఆశ. ఆయన వారు ముగ్గురితో, "మీలో ఎవరు గొప్ప కోరిక కోరితే వారికి నేను బహుమతి ఇస్తాను," అన్నాడు.

రాజుగారి విదూషకులలో ఒకడు, "నా కోరిక వినండి. ఆకాశమంతా కాగితమైపోయి, సముద్రమంతా సిరా అయిపోతే ఆ కాగితం

మీద ఆ సిరాతో నాకు కావలిసిన ధనం ఎంతో రాయగలుగుతాను!" అన్నాడు. రాజు నవ్వి, "చాలా బాగుంది," అన్నాడు.

రెండవ విదూషకుడు, "నా మిత్రుడు కోరినంత డబ్బు నాకు వచ్చినట్టయితే దాన్ని ఉంచటానికి ఆకాశంలో ఎన్ని నక్షత్రా లున్నాయో అన్ని కోటలు నాకు కావాలి!" అన్నాడు. "ఇది ఇంకా బాగుంది," అన్నాడు రాజుగారు.

తరవాత టిల్ రాజుగారితో, "మహా రాజా, నాకు వేరే కోరిక ఏమీ లేదు—నేను వీరిద్దరికీ వారసుడు కావాలి, తమరు వీరిద్ద రినీ ఉరి తీయించాలి!" అన్నాడు.

రాజుగారు ఈ మాటలకు విరగబడి నవ్వి బహుమానాన్ని టిల్‌కు ఇచ్చేశాడు.

ఈ విధంగా టిల్ దీర్ఘ కాలం ఆకతాయిగా జీవించి వృద్ధాప్యంలో మరణించాడు. చచ్చి పోతూ కూడా వాడు తన అకతాయి గుణాన్ని మానలేదు. వాడు తన మరణశయ్యపైన ఉండి ఒక మరణశాసనం తయారు చేయించి, అందులో ఇలా రాయించాడు: "నా శయ్యకు సమీపంగా ఉన్న ఇనప పెట్టెలో గల నా సొత్తులో ఒకవంతు చర్చికీ, ఒకవంతు నా మిత్రులకూ, మరొకవంతు నేను చనిపోయే నగరానికీ చెందాలి! నేను చనిపోయినాక సరిగా ఒక్క మాసానికి ఇనప పెట్టెను తెరిచి, నా సొత్తును పైవిధంగా నగర పాలకులు పంచిపెట్టాలి!"

తరవాత టిల్ చనిపోయాడు. టిల్ పేరు ప్రఖ్యాతులు కలవాడు కావటమే గాక, తన యావదాస్తిలో మూడోవంతు నగరానికి ఇచ్చేస్తున్నాడుగనక నగర పాలకులు మహా వైభవంగా టిల్‌కు అంత్యక్రియలు జరిపి, ఎంతో ఖర్చుచేసి అతనికి ఒక పాలరాతి విగ్రహంకూడా వేశారు.

నెల గడిచింది. అధికారులు వచ్చి ఇనప పెట్టె తెరిచి చూస్తే అందులో కంకరరాళ్ళు తప్ప ఇంకేమీ లేవు!





# గంగావతరణము

ప్రథమాశ్వాసము

సగరు డనెడి మహారాజు
చాల గొప్ప బలవంతుడు.
అతనికి ఇద్దరు భార్యలు,
అఱువైవేల కుమారులు.

ఆ రాజొక అశ్వమేధ
యాగమ్మును చేయ దలచి
గుఱ్ఱమ్మును పూజ చేసి
కొడుకులతో సాగనంపె.

కదము త్రొక్కి నురుగు గ్రక్కి,
కాళ్ళ వెంట దుమ్ము రేపి,
అఱ్ఱుసాచి ఆ గుఱ్ఱము
అడ్డు లేక పరుగెత్తెను.

కాల్బలమ్ము కదలె నపుడు
కలకలమని కలకలమని;
గజబలమ్ము కదిసె నపుడు
గణగణమని గణగణమని.

తఱలి వచ్చె రథబలమ్ము
ధనధనమని ధనధనమని;
డగ్గఱించె తురగబలము
టకటకమని టకటకమని.

దండు లిట్లు తఱలి పోవ
ధరణి యెల్ల దద్దరిల్లె;
దు మ్మెల్లెడ చిమ్మి రేగి
క్రమ్ముకొనెను నలుదిక్కుల.

దేవలోకమునకు రాజు
దేవేంద్రుడు చూచినాడు,
సగరరాజు యజ్ఞమ్మును
సైప లేక పోయినాడు.

వడివడి చను గుఱ్ఱమ్మును
ఒడిసి పట్టి దేవేంద్రుడు
ఎవ్వారికి తెలియకుండ
ఎటకో కొని పోయినాడు.

ఉత్పల సత్యనారాయణాచార్య



ద్వితీయాశ్వాసము :

అశ్వమేధ యాగ మెల్ల
అంతటితో ఆగి పోయె.
కొడుకుల పిలిపించి రాజు
కోపముతో ఇట్లు పలికె:

"వెతకి రండు గుఱ్ఱమ్మును
బ్రతుకనీను లేకపోతె—"
అనుచు కన్ను లెఱ్ఱ చేసి
ఆన తిచ్చె సగరరాజు.

కొడుకు లెల్ల కదలినారు
గుఱ్ఱమ్మును వెదకుటకై
రకరకాల వాజులపై,
రయము మీఱు తేజులపై.

పట్టణాలు తిరిగినారు,
పల్లెటూళ్ళ కరగినారు;
ఏ చోటను యజ్ఞాశ్వపు
ఆచూకీ దొరక లేదు.

కొండల పయి కెక్కినారు,
గుహల జొచ్చి వెదకినారు;
ఏ చోటను యజ్ఞాశ్వపు
ఆచూకీ దొరక లేదు.

బహు వనాలు పరికించిరి,
గహనాలను గాలించిరి;
ఏ చోటను యజ్ఞాశ్వపు
ఆచూకీ దొరక లేదు.

అటు భూమికి నలువైపుల
ఎటు చూచిన జలమయమ్ము.
ఆ నీళ్ళటు పోయి పోయి
ఆక్రమించె నాకాశము.

అవలి ఒడ్డు కానరాని
అంతు లేని దధి సంద్రము.
నురుగులతో తరగలతో
పొరలి పొర్లి పడుచుండెను.

ఐన గాని సగరపుత్రు
లావంతయు భయము లేక
అం దెల్లరు దూకినారు,
హయము వెదక సాగినారు.




ఎంత వెదకి నప్పటికి,
ఎంత ఈది నప్పటికి,
హయము జాడ లేకుండెను ;
అవలి ఒడ్డు రాకుండెను.

వడి వడిగా ఈది వారు
నడి సంద్రము చేరినారు.
గుఱ్ఱ మింక కనబడ దని
గుబులు పుట్టె నందఱికిని.

మొసలి గుంపు పయికి లేచి
మునుగుచుండె పుటుకు బుటుకు;
చెరలాడు తిమింగిలాలు
తిరుగుచుండె నటకు నిటకు.

రివ్వు మంచు హెూరు గాలి
రేగి త్రోపు లిడుచుండెను;
సుడిగుండము గుడగుడమని
సుళ్ళు తిరిగి పడుచుండెను.

సుడిగుండము లోని కేగి
చూచినారు రాకొమరులు.
అచట నొక్క గుహ యున్నది,
అడ్డుగ నొక రా యున్నది.

సగరసుతులు చెవి యొగ్గిరి,
చప్పు డేదొ ఆలించిరి ;
గుండు రాయి పెల్లగించి
గుహ లోనికి జొర బాఱిరి.

అంధకార బంధురమ్ము
ఆ మహా గుహాలయమ్ము;
కన్ను పొడుచుకొన్న గాని
కానరాని పెను చీకటి.

ఆ చీకటి గుహ లోనికి
అడుగులలో అడుగు లిడుచు
ఒదిగి ఒదిగి రాకొమరులు
ఒక్క రొకరు పోయినారు.

చీకటి మటుమాయ మయ్యె ;
చెట్ల గుంపు ఎదు రయ్యెను;
ఒదిగి ఒదిగి రాకొమరులు
ఒక్క రొకరు దాటినారు.

బుస్సు మనుచు పాము లెన్నొ
పుట్టల తిరుగాడుచుండె;
ఒదిగి ఒదిగి రాకొమరులు
ఒక్క రొకరు నడచినారు.

అచ్చట నొక చెట్టు క్రింద
ముచ్చటైన అరుగు మీద
ముని యొక్కడు కూర్చుండెను,
కనులు మూసికొని యుండెను.

అతని వెనుక ప్రక్కననే
హయ మున్నది! హయ మున్నది!
అచ్చముగా సగరరాజు
హాయమే యది! హయమే యది!

గుఱ్ఱ మపుడు మేత మాని
గుర్తు పట్టి సకిలించెను.
మునిని చూచి రాకొమరులు
కను లెఱ్ఱగ చేసినారు.

మునియె దొంగ అనె నొక్కడు;
ముని ముచ్చని పలికె నొకడు;

ముని మాత్రము కదలకుండ
కనులు మూసికొని యుండెను.

తిట్టు లనెను మఱి యొక్కడు,
కొట్టు డనెను వే ఱొక్కడు;
ముని మాత్రము కదలకుండ
కనులు మూసికొని యుండెను.

రాకొమరులు రెచ్చి పోయి
లాగినారు ముని గడ్డము.
ముని యంతట 'హు' మ్మటంచు
కనులు తెఱచి చూచినాడు.

ముని చూపుల కోపాగ్నికి
కనకన మని తగుల బడిరి
ఆ దాపున వా రందఱు,
బూడి కుప్ప లైపోయిరి.

ముని మాత్రము ఎప్పటి వలె
కనులు మోడ్చి కూర్చుండెను;
పాతాళపు గుహ నంతను
భస్మరాసి ముంచెత్తెను!—(సశేషం)






# అహింసాజ్యోతి

## [14]

అంగుళిమాలుడి తల్లి దండ్రులు తమ కొడుకుకోసం అరణ్యమంతా వెతికారు, కాని వాడి జాడ లేకపోయింది. సైన్యాన్ని తీసుకుని అరణ్యానికి వెళ్ళి తన ప్రజల పాలిటి యముడుగా ఉన్న అంగుళిమాలుణ్ణి చంపు తానని మాట ఇచ్చిన రాజుగారు తీరా వెళ్ళవలసి వచ్చేసరికి భయపడ్డాడు. అందుచేత ఆయన బుద్ధుడి సలహాకోసం విహారానికి వెళ్లి బుద్ధుడి కాళ్ళపై పడ్డాడు.

"రాజా, ఏం జరిగింది? బింబిసారుడు నీతో కలహించాడా? విశాలానగర రాజులు గాని, ఇతరులుగాని నీపై కత్తికట్టారా? నీకు వచ్చిన అపద ఏమిటి?" అని బుద్ధుడు రాజు నడిగాడు.

"అదేమీ కాదు. నేను అంగుళిమాలుడనే హంతకుణ్ణి పరిమార్చటానికి అరణ్యానికి బయలుదేరుతున్నాను," అన్నాడు రాజు.

"అతను భిక్షువు అయి ఉంటే ఏం చేస్తావు?" అని బుద్ధుడు అడిగాడు.

"తగిన విధంగా అర్చిస్తాను!" అని రాజు జవాబు చెప్పాడు. అయితే అలాటి పాపిని బుద్ధుడు తన శిష్యకోటిలో చేర్చుకుంటాడని ఆయన ఒక్కనాటికీ అనుకోలేదు. కాని ఆ గజదొంగ ఆ క్షణాన ఆ విహారంలోనే ఉన్నాడని తెలిసేసరికి రాజుకు ముచ్చెమటలు పోశాయి.

"రాజా, నీవు భయపడవలసిన అవసరమేమీ లేదు!" అని బుద్ధుడు ఆయనకు



ధైర్యం చెప్పాడు. బుద్ధుడు యిలా అనగానే రాజు తేరుకుని, "స్వామీ, అతను ఎక్కడ ఉన్నాడో నాకు చూపండి!" అన్నాడు.

ఆయన అంగుళిమాలుడి ముందు నిలబడి తన కాసెకోక విప్పి అతనికి సమర్పించాడు, కాని అంగుళిమాలుడు దాన్ని స్వీకరించలేదు.

"ఇది చాలా అద్భుతం! ఇంత మార్పు ఈ మనిషిలో ఎలా వచ్చింది?" అన్నాడు రాజు ఆశ్చర్యపోతూ.

తరవాత అంగుళిమాలుడు భిక్షాపాత్ర తీసుకుని తన గ్రామంలో భిక్షకు వెళ్ళాడు. అతన్ని చూసి జనం భయపడి పారిపో



యారు, ఎవరూ భిక్ష పెట్టలేదు. అతనికి ఆకలి దహించుకుపోతున్నది. అతను నగరానికి తిరిగి వచ్చి అక్కడ ఒక స్త్రీ ప్రసవించలేక బాధపడుతూండటం చూశాడు. ఆమెమీద అతనికి ఎంతో కనికరం కలిగింది. 999 మందిని నిశ్చింతగా హత్యచేసిన ఆ మనిషి బుద్ధుడి అనుచరుడయాక ఒక స్త్రీ పడే ప్రసవ వేదనకు కరిగిపోయాడు.

అతను విహారానికి తిరిగివచ్చి బుద్ధుడితో ఆ స్త్రీని గురించి చెప్పాడు.

"'నేను ఈ జన్మలో బుద్ధిపూర్వకంగా ఏ ప్రాణినీ హింసించనివాణ్ణి అయినట్టయితే ఈ స్త్రీ సుఖంగా ప్రసవించుగాక!' అని సత్యప్రమాణం చెయ్యి. ఆమె ప్రసవిస్తుంది," అన్నాడు బుద్ధుడు.

"స్వామీ, నేను అనేకమందిని హత్య చేశాను. అసత్యప్రమాణం చెయ్యలేను," అన్నాడు అంగుళిమాలుడు.

"నిజమే కాని, నీవు హత్యలు చేసినది ఈ జన్మలో కాదు. నీవు నాదగ్గిర చేరాక ఇంకొక జన్మ ఎత్తావు. ఆ కారణంవల్ల, నీవు చేసేది అసత్యప్రమాణం కాదు," అన్నాడు బుద్ధుడు.

అంగుళిమాలుడు నగరానికి తిరిగి వెళ్ళి ప్రసవించలేక బాధపడుతున్న స్త్రీ వద్ద





బుద్ధుడు చెప్పిన విధంగా సత్యప్రమాణం చేశాడు. మరుక్షణమే ఆ స్త్రీకి సుఖప్రసవం అయింది. ఈ ప్రసవం జరిగిన చోట ఒక భవనం కట్టారు. రోగులైన స్త్రీలు ఆ భవనంలోకి అడుగు పెట్టితే అంగుళిమాలుడి ప్రభావంచేత వారి రోగాలన్నీ పోయేవట.

తనను చూసి భయపడి భిక్ష పెట్టని వాళ్ళను చూసి అంగుళిమాలుడు చాలా బాధపడేవాడు. తాను చేసిన హత్యలుకూడా అతన్ని చాలా బాధించేవి. తన చేతిన చచ్చిపోయినవారు తమ ప్రాణాలు తీయవద్దని, తమపై కరుణ చూపమనీ, తాము చస్తే తమ బిడ్డలు అనాథలైపోతారనీ ఎన్నో విధాల బతిమాలారు. ఆ సంగతులు స్మరించుకుని అతని గుండె కొట్టుకుపోయేది. అతను ఇలా బాధపడుతూంటే బుద్ధుడు అతన్ని ఓదార్చి, "వాటిని గత జన్మ వృత్తాంతాలుగా భావించు " అని హితబోధ చేసేవాడు. కిందటి జన్మలో చేసుకున్న ఫలితాలు అనుభవించటానికి విచారించటం అంత ముఖ్యం కాదనీ, ముందుజన్మ లేకుండా చేసుకోవటమే అన్నిటికన్న ముఖ్యమనీ ఆయన అనేవాడు.

అంగుళిమాలుడిలాగే ఇంకా ఎందరో దొంగలూ, హంతకులూ బుద్ధుడి ప్రబోధాలు



విని పరివర్తన పొంది తమ జీవితాలను మార్చుకుని ఆయన శిష్యులయారు.

* * *

కుసీనరదేశంలో బంధులుడు అనే మహావీరుడుండేవాడు. ఇతను మాళ్వదేశపు రాజుకు మేనల్లుడు. కత్తి, డాలూ, విల్లూ, గదా, ఈటె—వీటిని ప్రయోగించటంలో ఇతనికి సమానులు జంబూద్వీపంలో మరెవరూ లేరట. ఇతను యువకుడై ఉండగా ఇతని మేనమామ అయిన మాళ్వరాజు ఇతనికి ఒక పరీక్ష పెట్టాడు. ఆయన అరవై వెదురు కర్రలలో అరవై ఇనప ఊచలు పెట్టి, ఆ వెదురు కర్రలనన్నిటినీ ఒక




మోపుగా కట్టి, బంధులుడితో, “నీవు ఒక్క కత్తివేటుతో ఈ వెదుళ్ళ నన్నిటినీ తెగవేసినట్టయితే నీకు నా కుమార్తెనిచ్చి పెళ్ళి చేస్తాను. ఒకవేళ ఈ పరీక్షలో నీవు ఓడిపోవటం జరిగితే, నేను మరొక అల్లుణ్ణి చూసుకుంటాను,” అన్నాడు.

బంధులుడికి ఇదేమంత గొప్పగా కనిపించలేదు. అతను తన కత్తినెత్తి వెదుళ్ళ కట్టను ఒక్క వేటు వేశాడు. ఆ దెబ్బకు 60 వెదుళ్ళూ, వాటిలో ఉన్న ఇనప చువ్వలూ తెగిపోయాయి. ఇనపచువ్వలు గలగలమనగానే బంధులుడికి తన మామ చేసిన పని తెలిసిపోయింది. అందరి ఎదటా తనను అవమానించటానికే ఆయన అలా చేశాడని ఆగ్రహించి, రాజకుమార్తె అయిన బంధుమల్లికను పెళ్ళాడుతూనే, అతను తన మామతో, “నేను నీ దేశంలో ఉండను. మరెక్కడికైనా వెళ్ళి జీవిస్తాను,” అన్నాడు. అతను భార్యతో సహా బయలుదేరి నగరం దాటి వెళ్ళిపోతూంటే రాజుగారూ, ఇతరులూ ఆపాలని చూశారు, కాని అది వారికి సాధ్యంకాలేదు.

కోసలదేశపు రాజు బంధులుడి సహాధ్యాయి. అందుచేత బంధులుడు ఆయన వద్దకు వెళ్లాడు. రాజు అతన్ని ఎంతో ఆదరంతో చేరదీసి, “నీవంటి బలశాలి అండ ఉంటే జంబూద్వీపమంతా గెలవనా?” అంటూ బంధులుణ్ణి తన సర్వసేనానిగా నియమించాడు. ఇప్పుడు కోసలదేశంలో రాజుతరవాత రాజంతవాడు బంధులుడే. కోసలకు బంధులుడు అండ అయాడని విని మిగిలిన రాజులు వణికిపోయారు.

బంధులుడి భార్యకూడా సామాన్యురాలు కాదు. ఆమెకు అయిదు ఏనుగుల బలం ఉండేది. ఆమెవద్ద మేఖల అనే ఆభరణం ఉండేది. ఆమె బుద్ధుడి శిష్యురాలు. ఆమెకు సంతానం లేకపోవటం ఒక్కటే బంధులుణ్ణి బాధించింది. ఆమె గర్భాన తనలాటి బల






శాలి అయిన కొడుకు కలగాలని అతను ఎంతగానో కాంక్షించాడు. చివరకు బంధులుడు ఆమెను వదిలేసి మరొక భార్యను చేసుకోవటానికి నిశ్చయించుకుని, "నీవు మీ పుట్టింటికి వెళ్ళిపో!" అన్నాడు.

ఈ మాట వినేసరికి ఆమెకు చాలా విచారం కలిగింది. కోసలలో ఉంటూ ఆమె బుద్ధుడి బోధలు వినగలుగుతున్నది. పుట్టింటికి వెళ్ళిపోతే ఇక అందుకు అవకాశం ఉండదు. ఈ విచారంతో ఆమె బుద్ధుడి సలహాకోసం వెళ్ళింది.

బుద్ధుడు ఆమె కథ అంతా విని, "నీవు బంధులుడి వద్దకే తిరిగి వెళ్ళు!" అన్నాడు. బుద్ధుడు ఏదో మనసులో ఉంచుకొని తన భార్యకు ఈ సలహా ఇచ్చాడన్న నమ్మకంతో బంధులుడు తన భార్యను మళ్లీ స్వీకరించాడు. అది మొదలు వారు ఎప్పటిలాగే అన్యోన్యంగా ఉంటూ వచ్చారు.

కొంతకాలానికి బంధుమల్లిక గర్భవతి కూడా అయింది. ఆమె ఒకనాడు తన భర్తతో, "నాకు లిచ్ఛవీ రాజకన్యలు స్నానంచేసే కొలనులో స్నానంచెయ్యాలని ఉన్నది," అన్నది. బంధులుడు వెంటనే ఆమెను తీసుకుని విశాలానగరానికి వెళ్లాడు. ఆ నగరపు కోట ద్వారాన్ని కాచేవాళ్లు బంధులుణ్ణి నివారించటానికి ఎలాటి ప్రయత్నమూ చేయలేదు.

బంధులుడు తన భార్యను నేరుగా క్రీడా సరోవరానికి తీసుకువెళ్ళాడు. దాని చుట్టూ ఇనప అలవ ఉన్నది. బంధులుడు దాన్ని అవలీలగా తన కత్తితో ఛేదించి, తానుకూడా తన భార్యతోబాటు జలక్రీడలాడి తరవాత ఇంటికి బయలుదేరాడు.

ఈ సంగతి లిచ్ఛవీ రాజకుమారులకు తెలిసి మండిపడ్డారు. వారు తమ రాజుగారి వద్దకు వెళ్ళి బంధులుడి ప్రవర్తనవల్ల తమ నగరానికి తీరని అవమానం జరిగిందన్నారు. అతన్ని చంపి అతని శిరస్సు తెచ్చినదాకా




అన్నం ముట్టమన్నారు. ఈ ప్రతిజ్ఞతో 500 మంది రాజకుమారులు రథాలెక్కి బంధులుణ్ణి వెన్నంటటానికి సిద్ధమయారు.

"అతను బలాఢ్యుడు, ఒక్క వేటుతో మిమ్మల్నందర్నీ నాశనం చెయ్యగలడు. తొందరపడకండి!" అని రాజు వారికి హితం చెప్పాడు.

"అతను మనిషి కాడా? మేమేమన్నా ఆడవాళ్లమా?" అన్నారు రాజకుమారులు. రాజు వారికి మాయోపాయాలతో బంధులుణ్ణి గెలవమని సలహా ఇవ్వబోయాడు; కాని వారాయన మాటలు లక్ష్యపెట్టక రథాలపై ఒకరి వెనకగా ఒకరు బయలుదేరారు.



తన భార్యతో తిరిగిపోతున్న బంధులుడు తనను వెన్నంటి వచ్చే లిచ్ఛవీ రాజకుమారుల సోల్పును చూసి, బలమైన బాణం ఎక్కుపెట్టి, అయిదువందల రాజకుమారుల శరీరాలూ దూసుకుపోయేలాగ కొట్టి మళ్ళీ ప్రయాణం సాగించాడు.

తాము దెబ్బ తిన్నామన్న సంగతికూడా లిచ్ఛవులు గ్రహించలేదు. వారు బంధులుడిపై బాణాలు వేస్తూ, "పిరికిపందా! నిలబడి మాతో యుద్ధం చెయ్యి," అని పెద్దగా కేకలు పెట్టారు.

"నేను చచ్చిపోయినవాళ్ళతో యుద్ధం చెయ్యను. మీరంతా చచ్చిపోయారు!" అన్నాడు బంధులుడు.

ఈ మాటలు లిచ్ఛవీ రాజకుమారులలో ఏ ఒక్కరూ నమ్మలేదు.

"మీ కవచాలు విప్పెయ్యండి, నిజం మీకే తెలుస్తుంది," అన్నాడు బంధులుడు. ఇద్దరు లిచ్ఛవులు తమ కవచాలు విప్పి చచ్చి పడిపోయారు. ఇది చూడగానే భీతావహులై మిగిలినవారంతా ఇళ్లకు తిరిగిపోయి, అక్కడ తమ కవచాలు విప్పుతూనే చచ్చి పడిపోయారు.

బంధుమల్లిక సకాలంలో ఇద్దరు కుమారులను ప్రసవించింది. అటుతరవాత ఆమె



ఏటా ఇద్దరేసి కుమారులను ప్రసవించి, ముప్ఫై ఇద్దరు పిల్లల తల్లి అయింది.

* * *

శుద్ధోదన మహారాజు రెండవ భార్య ప్రజాపతి. సిద్ధార్థుణ్ణి కన్న మాయాదేవి ఏడు రోజుల బాలింతరాలుగా మరణించగా, ప్రజాపతి తన కొడుకైన నందుణ్ణి పెంచటానికి దాదులను నియోగించి సిద్ధార్థుణ్ణి తానే స్వయంగా పెంచి, అతనికి తల్లి అయింది. సిద్ధార్థుడు బుద్ధత్వం సంపాదించిన అనంతరం కపిలవస్తునగరానికి రాగా శుద్ధోదన మహారాజుతోబాటు ప్రజాపతికూడా బుద్ధ మతం అవలంబించింది.

ప్రజాపతీ, మాయాదేవీకూడా కోలీరాజు కుమార్తెలు.

కపిలవస్తు నగరానికీ కోలీ నగరానికీ మధ్యగా రోహిణీనది ప్రవహిస్తుంది. ఈ నదికి ఆనకట్ట కట్టి నదీజలాన్ని ఉభయ నగరాల వారూ పొలాలకు పెట్టుకునేవారు. అయితే ఒకఏడు వానలు లేక నదిలో నీరు తగ్గిపోయింది. నదికి రెండువైపులా ఉండే పొలాలకు చాలినంత నీరు లేదు.

"ఈ నీటిని ఉపయోగించుకునే మొదటి హక్కు మాదే!" అన్నారు కపిలవస్తు ప్రజలు. కోలీ ప్రజలు కూడా అమాటే



అన్నారు. జగడం ఆరంభమయింది. రెండు పక్షాలా వంద వంద మంది చేరి ఒకరినొకరు దుమ్మెత్తి పోసుకున్నారు. శాక్యులు తమ ఆధిక్యతను కత్తులతో రుజువుచేస్తామన్నారు, కోలీయులు కూడా వెనకాడక కత్తులు దూశారు. నదీతీరాన రెండుపక్షాల సేనలూ కూడాయి. ఉభయ దేశాలకూ చెందిన పరిపాలకులు తమ పక్షాలను శాంతింపజేయలేకపోయారు.

ఆ సమయాన బుద్ధుడు అటుగా వచ్చాడు. బుద్ధుడి సమక్షంలో యుద్ధం చెయ్యటం భావ్యంగా ఉండదని శాక్యులూ, కోలీయులూ కూడా తమ ఆయుధాలను



దాచిపెట్టారు. బుద్ధుడు నదిగట్టున ఎత్తయిన చోట కూచుని అందరి వందనాలూ అందుకుని, "ఏదైనా తెప్పతిరునాళ్ళు చేయవచ్చారా ఏమిటి? ఎందుకింతమంది గుమికూడారు?" అని ప్రశ్నించాడు.

"యుద్ధం చేయవచ్చాం!" అని వారు బుద్ధుడితో చెప్పారు.

"యుద్ధమా? ఎందుకు?" అని బుద్ధుడు అడిగాడు.

నాయకులైన రాజులు అసలు కారణమేమిటో తమకు తెలియదన్నారు. విచారిస్తూ పోగా నీటి తగాదా అని రైతులద్వారా బుద్ధుడికి తెలిసింది.

"నీటి విలువ ఏమిటి? భూమి విలువ ఏమిటి? ప్రాణాల విలువ ఏమిటి?" అని బుద్ధుడు అడిగాడు.

నీటికన్నా, భూమికన్నా ప్రాణాల విలువే ఎక్కువని, అక్కడచేరిన ప్రజలూ, రాజులూ ఒప్పుకున్నారు.

తరవాత బుద్ధుడు అక్కడ చేరినవారికి తన బోధలు వినిపించాడు. దాని ఫలితంగా శాక్యులూ, కోలీయులూ జగడం మాని తమ ఉత్తమ కుటుంబాలనుంచి 250 మంది యువకుల చొప్పున బుద్ధుడి అనుచరులుగా పంపారు. బుద్ధుడు ఈ 500 మందితోనూ మహావన విహారంవద్ద కొంతకాలం ఉన్నాడు. ఈ యువకులు అప్పుడప్పుడూ తమ నగరాలకువెళ్ళి వస్తూండేవారు. వారిని తిరిగి గృహస్థులను చేయాలని వారి భార్యలు గట్టి ప్రయత్నం చేశారు, కాని బుద్ధుడు యువకుల మనస్సులను దృఢంగా చేసి ఈ ప్రయత్నం కొనసాగకుండా చేశాడు.

తరవాత 500 మంది రాజకుమార్తెలూ ప్రజాపతి వద్దకు వెళ్ళి, "దేవీ, మా భర్తలు బౌద్ధ సన్యాసులైపోయారు. భర్తలు లేని బతుకు మాకెందుకు? మేముకూడా సన్యాసినులమైపోతాం!" అన్నారు.

—(ముగింపు పై సంచికలో)






## 3. జంతుశిక్షణ

1954లో కిస్మస్ పండుగ ముందురోజున నాకు పంథొమ్మిదో ప్రమాదం జరిగింది. ఎంత మచ్చిక అయిన జంతువునుకూడా పూర్తిగా నమ్మటానికి లేదనీ, ఎంత మంచి జంతువులో కూడా చంపే బుద్ధి ఉండనే ఉంటుందనీ ఈ సంఘటన నాకు జ్ఞాపకం చేసింది—జ్ఞాపకం చేయవలసిన అగత్యం కూడా లేదు.

జంతువుల ప్రవర్తన—ఆ మాటకు వస్తే మనుషుల ప్రవర్తనకూడా—ఆకళించుకునేటప్పుడు మనం రెండు అంశాలను విచక్షణ చేసి చూడాలి: ఒకటి, సహజ ప్రవృత్తివల్ల ఏర్పడే ప్రవర్తన ("ఇన్‌స్టింక్ట్"); రెండవది శిక్షణద్వారా అలవడే వర్తన.

"శిక్షణ", "లొంగదీయుట" అనే మాటలలో నిర్బంధించటం స్ఫురిస్తుంది, (మచ్చిక చేయుటం అన్న మాటలలో ఇది లేదు.) శాశ్వతమైన సత్ఫలితాలు కలగాలంటే జంతువులను దయాదాక్షిణ్యాలతో సాకాలి. ఇలాటి ఫలితాలు జంతువును బాగుచేయుటమే గాక దాని పిల్లలకు కూడా సంక్రమిస్తాయి. అలవడిన లక్షణాలు సంక్రమిస్తాయంటే కొందరు శాస్త్రవేత్తలు ఒప్పుకోరు, కాని మా వృత్తిలో ఇది అనుభవంలో రుజువయిన పరమ సత్యంగా భావిస్తాం.

జంతువులకు శిక్షణ ఇవ్వటమన్నది ప్రతి ఉమ్మాయీ, జగ్గాయీ చేసే పని కాదు. అదీ గాక మనిషిని మనిషి అర్థంచేసుకోవటానికి అలవాటు చేసుకున్న పద్ధతులు సింహాలనూ, పులులనూ, ఎలుగుబంట్లనూ, చిరతపులులు వగైరాలనూ అర్థంచేసుకోవటానికి ఎంతమాత్రమూ పనికిరావు. జంతువుల మనస్సులను ఆకళింపు చేసుకునే ప్రత్యేక శక్తి ఎన్నో ఏళ్ళ అనుభవంవల్లగాని అలవడదు.

జిమ్ క్రే



ఇలాటి ప్రత్యేక శక్తిని అలవరుచుకున్న వాడికి కూడా అనుక్షణమూ జంతువుల భయం ఉండనే ఉన్నది. వాడికి జంతువులపై అనురాగమూ, వాటి మనసు గ్రహించే శక్తి ఉన్నంతమాత్రాన సరిపోదు; ఏ ఒక జంతువుకైనా వాడిపై అనాదరణ ఏర్పడవచ్చు, తానే జంతువు మనసు తప్పుగా అర్థంచేసుకోవచ్చు, దాని ప్రవర్తనను అపార్థం చేసుకోవచ్చు—ఇవి ప్రమాదానికి దారితీస్తాయి.

సమర్థుడైన శిక్షకుడు మనుష్యుల స్వభావ ప్రవర్తనలను అనుసరించి జంతువులను అర్థంచేసుకొన యత్నించడు. వస్తువుల ఆకారాలూ, ప్రమాణాలూ, రంగులూ మొదలైనవి మనకు కనిపించిన విధంగా జంతువులకు కనిపిస్తాయనుకునేటందుకు లేదు. వాటి శ్రవణశక్తి మనదానికన్న చురుకుగా ఉండటమేగాక, మనని బాధించని ధ్వనులు వాటిని బాధించటంకూడా కద్దు. మన శ్రవణశక్తికి అతీతమైన ధ్వనులు వాటికి వినబడతాయి. అలాగే మన జిహ్వ రుచులూ వాటివీ ఒక రకంగా ఉండవు. ఉదాహరణకు, అవి ఘాటైన మాంసమంటే ఇష్టపడతాయి, మనుషులు తింటే రోగం వచ్చే పనికిమాలిన మాంసభాగాలను అవి ఇష్టంగా తింటాయి; మనుషులకు రుచించే తాజా మాంసం వాటికి చప్పగా ఉంటుంది. అంతేగాక మనకు సువాసనలనిపించేవి వాటికి వికటిస్తాయి. నవనాగరిక యువతులు వాడే సెంట్లు వాసన తగిలితే అవి ముక్కులు చిట్లించి చీదరించుకుంటాయి. మనకు రోత గలిగించే పదార్థాలకేసి అవి తమ శరీరాలను ఇష్టంగా రుద్దుకుంటాయి, అలాటి పదార్థాలలో పొర్లాడతాయి. ఒక్కముక్కలో చెప్పాలంటే వాటి జ్ఞానేంద్రియాలూ, మన జ్ఞానేంద్రియాలూ ఒకవిధంగా పనిచేయవు.

ఒక జంతువు మొరాయించినా, ఎదురు తిరిగినా అందుకు తగిన కారణం ఉండనే

ఉంటుంది. ఉదాహరణకు, కొన్ని అనుభవాలు ఆ జంతువుయొక్క బుద్ధిపైన—సహజ స్వభావంపైన కాదు—అవాంఛనీయమైన ప్రభావం కలిగించి ఉండవచ్చు; ఆ ప్రభావాన్ని మనం ఉపేక్షించి ఉండవచ్చు; లేదా తప్పుగా అంచనాకట్టి ఉండవచ్చు.

ఈ ఉపోద్ఘాతం ఇంత పొడుగున చెప్పినందుకు మీరు శాంద్రా అనే సింహం యొక్క ప్రవర్తననూ, మాకు సంభవించే విఘ్నాలనూ మరింత బాగా అర్థంచేసుకోగలుగుతారు.




శాంద్రా సొంతదారు శారా కారిత్ అనే ఆమె. ఆమె చాలా సమర్థురాలు, సర్కసు ప్రపంచంలో గొప్ప కీర్తి గణించినవారిలో ఒకతె. ఆమె తండ్రి మేస్త్రీటు, ఆమె ఫ్రెంచిది. తండ్రి ఆమె రెండవ ఏటనే పోయాడు, ఆమె స్వేచ్ఛగా పెరిగింది. ఆమెకు జంతువులంటే, ఏ జంతువులన్నా, ఎంతో ప్రేమ; మొదట్లో తన పరిసరాలలో ఉండే కుక్కలకూ, చెవులపిల్లులకూ, కోళ్ళకూ, మేకలకూ శిక్షణ ఇచ్చేది.

గట్టి దీక్షా, నిబ్బరమైన మనస్సూ, అసాధారణ ప్రజ్ఞా, జంతువులకు సయితం మెత్తని మనసులుంటాయన్న విశ్వాసమూ ఉండటంచేత క్రమంగా ఆమె జంతువులను మచ్చిక చేసే వృత్తిలోకి దిగింది. అయితే ఆమె మొదట్లో వినోద ప్రదర్శనాలలో గరిడీ నృత్యాలు చెయ్యటంతో ధనార్జన ప్రారంభించి, ఆ నృత్యాలకు ఉపాంగంగా రెండు కొండచిలువలను స్టేజిమీద ప్రవేశపెట్టింది. అటుతరవాత శారా ప్రతిష్ఠ హెచ్చింది; ఆమె పేరు పోస్టర్ల పైభాగానికి ఎగబాకి పెద్దపెద్ద అక్షరాలతో ప్రత్యక్షం కాసాగింది. ఆమె వెంట ఎప్పుడూ ఏవో జంతువులు స్టేజిపైన ఉంటూనే ఉండేవి. ఆఖరుకు సింహాలు వచ్చాయి. అటుతరవాత ఆమె సింహాలూ, పులులూ వెంట లేకుండా ప్రదర్శనం ఇవ్వలేదు. ఆమెకు మొట్టమొదటిసారి ప్రమాదం

కలిగించినది "ఇన్కి" అనే సింహం. అది ఆమెను తన పంజాతో పట్టి అలవ అంతటా ఈడుస్తూ, కుక్క ఎలుకను విదిలించినట్టు విదిలించింది. ఆమెను రక్షించారు, కాని భుజాలు బాగా గాయపడ్డాయి. ఇది జరిగిన మర్నాడు పత్రికలవాళ్ళు ఆమెను, ఇక ఈ వృత్తికి ఉద్వాసన చెబుతావా అని అడిగారు.

"నా జన్మలో నేనిది తప్ప మరే వృత్తీ చెయ్యను," అన్నదామె.

ఆమె అన్నంతా చేసిందికూడానూ. ఆమె స్వయాన సింహాలను కొని వాటికి శిక్షణ ఇచ్చింది. ఆమె ప్రదర్శనలు అద్భుతంగా ఉండేవి. ఆమె వెంట ఉండేవారిలో ఒక నర్తకి ఉండేది; ఆమె వృత్తినామం లూసిటానియా. ఆమె చిరుతపులి చర్మపు దుస్తులు ధరించి లయ నృత్యం చేసేది. ఈ నృత్యాలు ఒక గుండ్రని పీటపైన, సింహాలున్న అలవలో జరిగేవి. ఎన్నడూ ఎలాటి విఘ్నమూ కలగలేదు. ఇంతలో శారా సింహాలలో ఒకటి చనిపోయి, దానికి బదులుగా కొత్తసింహం ఒకటి వచ్చింది. దానికి లూసిటానియా నృత్యాలు కొంచెంకూడా రుచించలేదు.

"జాగ్రత్త! అది నీ నృత్యానికి అలవాటు పడేదాకా నృత్యంచేసే కాలాన్ని తగ్గించు," అని శారా హెచ్చరించింది.

కాని లూసిటానియా ఈ హెచ్చరికను పాటించలేదు. కొత్త సింహం నృత్యంచేసే ఆమె పాదాలకేసి వింతగా చూస్తూండేది. ఆమె పాదాలకు ధరించిన బూట్లపై అలంకారంగా ఊలు కుచ్చులున్నాయి. ఉన్నట్టుండి సింహం ఆ పాదాలపైకి లంఘించింది ... ఇలాటిదేదో జరుగుతుందని ముందే తెలుసుగనక శారా సింహాన్ని వెంటనే అదుపుచేసి, దాని స్థానంలో కూచోబెట్టింది. ఆ తరవాత లూసిటానియా తన బూట్లపైగల కుచ్చులు తీసి పారేసి, శారా సలహాను పాటించింది.

—(పై సంచికలో "సాహస చర్యలు")



## చిన్న భూతం : పెద్ద భూతం





తండ్రి: (కొడుకుతో) ఈ పెద్ద అస్థిపంజరం ప్రాచీన మానవుడిది.
చిన్న అస్థిపంజరంకూడా వాడిదే—చిన్నప్పటిది.



# మోసపోయిన భూస్వామి

పూర్వం చీనాదేశంలో మాత్సాయ్ అనే పేదరైతు ఉండేవాడు. అతను చాలా యుక్తిపరుడు, అందుచేత భూస్వాములకు పక్కలో బల్లెంగానూ, ఇతర పేద రైతులకు దేవుడులాగానూ ఉండేవాడు. తరతరాలుగా అతని వంశంవాళ్లు వ్యవసాయంలో జీవితాలు గడిపికూడా దారిద్ర్యంనుంచి బయట పడలేకపోయారు. అందుచేత మాత్సాయ్ ఒకఏడు భూస్వామికి గింజలు కొలవరాదని తీర్మానించుకున్నాడు. పంట రాగానే అతను ధాన్యం అమ్మి కొన్ని బలిసిన కోళ్లను కొన్నాడు, ఒక వేటగాడికి డబ్బులిచ్చి రెండు నక్కలనుకూడా సంపాదించాడు. ఆ రెండు నక్కలలోనూ ఒకదాన్ని చీకటిగదిలో కట్టి ఉంచి, రెండవదాని మెడకు తాడు కట్టి తనవెంట తిప్పసాగాడు.

భూస్వామి తనకు రావలిసిన ధాన్యం వసూలు చేసుకునేటందుకు బయలుదేరి దారిలో మాత్సాయ్‌ని కలుసుకున్నాడు.

"తమ ధాన్యంగింజలు సిద్ధంగా ఉంచాను. మీ యిష్టంవచ్చినప్పుడు పట్టుకుపోవచ్చు," అన్నాడు మాత్సాయ్.

"అవునుగాని, దీన్ని పట్టుకు తిరుగుతున్నావేమిటి? తప్పించుకుపోదూ?" అన్నాడు భూస్వామి నక్కను చూపిస్తూ.

"పోనివ్వండి! ఏం పోతే? అట్లా తిరిగి రావటం మంచిదేగా!" అంటూ మాత్సాయ్ నక్కతో, "నువు పోయి మంచి కోళ్ళను పట్టుకురావే!" అంటూ దాని మెడకున్న తాడు విప్పాడు. కట్టు ఊడిందే చాలునని నక్క శరవేగంతో పారిపోయింది.

"నీకేమైనా మతి పోయిందా ఏమిటి? అది నక్క కాదూ? అది మళ్ళీ నీకంట పడుతుందా?" అన్నాడు భూస్వామి.

"దానిసంగతి మీకు తెలీదు. రేపు మధ్యాన్నం తమరు మా ఇంటికి భోజనానికి

బి. నరసింహశర్మ

రావాలి. వస్తారనే నమ్మకంతోనే కోళ్ళను తెప్పిస్తున్నాను. ఆలస్యంచెయ్యక వేళకు రండి," అన్నాడు మాత్సాయ్.

మర్నాడు మధ్యాన్నానికల్లా మాత్సాయ్ దివ్యమైన విందుభోజనం తయారుచేయించాడు. వాళ్ల ఇల్లు అంతదూరం ఉండగానే భూస్వామికి కమ్మని మసాలా వాసన కొట్టింది. భోజనాల బల్లమీద అనేక రకాలుగా వండిన కోడిమాంసం వేరువేరు పళ్లాలలో సిద్ధంగా ఉన్నది.

"మాత్సాయ్, నీ నక్క ఏదీ? దాన్ని కూడా తీసుకురా, మనతోపాటే అదికూడా తిండి తింటుందీ!" అన్నాడు భూస్వామి.

"దానికేం తొందరలెండి. ముందు మన భోజనం కానిద్దాం," అన్నాడు మాత్సాయ్.

ఇద్దరూ భోజనం చేశారు. సుష్టుగా తిన్నాక భూస్వామికి నక్కమీద ధ్యాస మళ్లింది. అటువంటి నక్క తనవద్ద ఉంటే సదుపాయంగా ఉంటుందిగదా అనుకుని, ఆయన మాత్సాయ్‌తో, "ఏదీ, నీ నక్కను ఒక్కసారి తీసుకురా, చూస్తాం!" అన్నాడు.

మాత్సాయ్ భూస్వామి మాటలకు తనలో తాను నవ్వుకుని లేచి వెళ్లి, చీకటి గదిలో దాచి ఉంచిన రెండో నక్కను తాడుతో సహా బయటికి తెచ్చాడు. "మంచి నక్కే! దీన్ని




అయిదువందల తులాల వెండికి అమ్ముతావా?" అని భూస్వామి అడిగాడు.

మాత్సాయ్ తల అడ్డంగా తిప్పుతూ, "అమ్మటమే! నా బతుకంతా దానిమీదే ఆధారపడి ఉంది. దాన్ని అమ్మితే మాడి చచ్చిపోనా? మీకు నేనివ్వవలిసిన ధాన్యమూ, పాత బకాయీ పట్టుకుపొండి. నక్కనుమాత్రం అమ్మను," అన్నాడు.

"మాత్సాయ్! నీ ముష్టి మక్తా నాకొద్దు, నక్కే కావాలి. వెయ్యి తులాల వెండి తీసుకో. ఏమంటావ్?" అన్నాడు భూస్వామి.

మాత్సాయ్ దీర్ఘంగా నిట్టూర్చి, "మీరు కాదు కూడదని పట్టుబట్టినాక తప్పేదే



ముంది ? నే కోరేదల్లా ఏమిటంటే పదిహేను వందల తులాల వెండి దయచేయించండి. తక్కువైతే గిట్టుబాటు కాదు," అన్నాడు.

భూస్వామి సంతోషంగా అతను కోరిన ప్రకారం వెండి ఇచ్చి నక్కను పట్టుకు పోయాడు. ఆయన ఇంటికి వెళ్లి తన భార్యతో, "ఒక అద్భుతమైన నక్కను కొనుక్కొచ్చాను. అది మంచిమంచి కోళ్లను దొంగిలించి తెచ్చి ఇస్తుంది," అన్నాడు.

"నేను చచ్చినా నమ్మను!" అన్నది ఆయన భార్య.

భూస్వామి, మాత్సాయ్‌లాగే, నక్కను తట్టి, "నువు పోయి మంచి కోళ్లను పట్టుకు రావే!" అంటూ దాని మెడ తాడు విప్పేశాడు. మరుక్షణం అది పారిపోయింది. ఎన్ని రోజులు గడిచినా నక్క తిరిగి రాకపోవటం చూసి భూస్వామి తాను మోసపోయినట్టు తెలుసుకున్నాడు.

అతడు మండిపడి పళ్ళు పటపటా కొరికి, తన మనుషులను పదిమందిని తీసుకుని మాత్సాయ్ ఇంటికి వెళ్ళి, అతన్ని పట్టి బంధించి, "నన్నే మోసగిస్తావుట్రా, నీచుడా? నా వెండి నాకిచ్చావంటే నిన్ను ఇప్పటికైనా తేలికలో పోనిస్తాను," అన్నాడు.

"అదంతా అప్పుడే ఖర్చయిపోయింది గదండీ!" అన్నాడు మాత్సాయ్.

"వీణ్ణి కర్రలతో చచ్చేదాకా కొట్టండి!" అని భూస్వామి తన మనుషులకు ఆనతిచ్చాడు.

ఒక చెంప మంచు పడుతున్నది, చలి విపరీతంగా ఉన్నది.

"అయ్యగారూ, ఇప్పుడు వీణ్ణి చంపినా పాతెయ్యటానికి వల్లపడదు. రేపు చంపేస్తే ఏం?" అన్నారు భూస్వామి మనుషులు.

"అలాగే చేద్దాం. తెల్లవార్లూ చలితో తీసుకోనీ! వీడి వంటిన మామూలు బట్టలు మాత్రమే ఉంచి, గానుగరాతికి కట్టి ఉంచండి," అన్నాడు భూస్వామి.



తరవాత మాత్సాయ్‌ని ఆరుబయట గానుగరాతికి కట్టేసి అందరూ వెళ్ళిపోయారు. మంచూ, చలీ మాత్సాయ్‌ని తీవ్రంగా బాధిస్తున్నాయి. వాడు చలిబాధ నుంచి తప్పించుకోవటానికి గానుగను తిప్ప సాగాడు. ఇలా చెయ్యటంవల్ల వాడి శరీరం వేడెక్కటమే గాక చెమటకూడా పట్టింది.

"వాడు చలికి ఈపాటికి చచ్చేఉండాలి, చూసిరా," అని భూస్వామి తన మనిషిని గానుగ వద్దకు పంపాడు. వాడు తిరిగివచ్చి ఆశ్చర్యంగా, "దొరా, వాడు చలికి చావలేదు సరికదా, ఒళ్ళంతా చెమటలు పోసి ఊదుకుంటున్నాడు!" అన్నాడు.

"ఇందులో ఏదో మర్మమున్నది. అది తెలుసుకుని మరీవాణ్ణి చంపిస్తాను," అనుకుని భూస్వామి వాడివద్దకు వచ్చి, "మాత్సాయ్, ఇంత చలిలో నీకు చెమట ఎలా పోస్తున్నది?" అన్నాడు, రాని నవ్వు తెచ్చుకుంటూ.

"నిష్కారణంగా నిరపరాధిని దండిస్తే ఏమవుతుంది, బాబూ? నేను తమకిచ్చిన నక్క నిజంగా మహిమగలది. దానికి మీరు ఎలాగో కోపం తెప్పించి ఉండాలి. ఒకవేళ దాని మహిమను మీ ఇంట్లోవాళ్ళు నమ్మలేదేమో. ఆ సంగతి తెలిస్తే అది మళ్లీ రాదు!" అన్నాడు మాత్సాయ్.



"అలాంటిదేమైనా జరిగిందేమో మరి. ఇంతకూ ఈ రహస్యమేమిటి? ఇంత చలిలో నీకు చెమట ఎందుకు పోసింది?" అని భూస్వామి అడిగాడు.

"కళ్ళ ఎదటే కనిపించేది మీరు చూడలేకుండా ఉన్నారు. నేను వేసుకున్న చొక్కా ఏమిటనుకుంటున్నారు? ఇది ఎంతో మహిమగలది. ఇది వేసుకుంటే చలికాలం వెచ్చగా ఉంటుంది, వేసవికాలం చల్లగా ఉంటుంది," అన్నాడు మాత్సాయ్.

"దాన్ని అయిదువందల తులాల వెండికి అమ్ముతావా ఏమిటి?" అని భూస్వామి అడిగాడు. "దయచేసి బేరమాడకండి. ఇది





మా తాతకాలంనుంచీ వస్తున్నది. దీన్ని ఏకాడికీ అమ్మను," అన్నాడు మాత్సాయ్.

"అది నాకు కావాలి, మాత్సాయ్. కావలిస్తే వెయ్యితులాల వెండి తీసుకో!" అన్నాడు భూస్వామి.

"అంతగా కావాలంటున్నారుగనక, రెండువేల తులాల వెండి దయచేయించండి. ఇది మీకిచ్చేస్తే చలికి చచ్చిపోతాను," అన్నాడు మాత్సాయ్.

భూస్వామి వాడు కోరినంత వెండి ఇచ్చి, వాణ్ణి విడిచిపుచ్చి, ఆ చొక్కా తీసుకుని ఇంటికి పోయి తన నౌకర్లచేత దాన్ని ఉతికి అరవేయించాడు. తరవాత చలిలో ఆయన ఆ చొక్కామాత్రం తొడుక్కుని అత్తవారింటికి వెళ్ళాడు. చచ్చేచలి పుట్టింది, పైపెచ్చు అందరూ ఆయననుచూసి నవ్వారు.

మాత్సాయ్ తనను మళ్ళీ మోసపుచ్చాడని భూస్వామి తెలుసుకున్నాడు. ఈసారి ఆయన మాత్సాయ్ మాయలో పడరాదనీ, వాణ్ణి చంపించాలనీ నిశ్చయించాడు. ఆయన మనుషులు మళ్ళీ మాత్సాయ్‌ని పట్టి తెచ్చారు. ఈసారి భూస్వామి వాణ్ణి ఒక గోతంలో కట్టించి, సముద్రం ఒడ్డున ఉన్న గుట్టవద్దకు పట్టించి తీసుకుపోయాడు. అక్కడ ఒక చెట్టున్నది. దాని కొమ్మ సముద్రంమీదికి ఉన్నది. గోతాన్ని ఆ కొమ్మకు కట్టారు.

భూస్వామి నౌకరుతో, "ఒరే, ఆ కొమ్మ కొట్టెయ్యి, అంతటితో వీడి పీడ విరగడ అవుతుంది," అన్నాడు. నౌకరు కొంతసేపు కొమ్మ కొట్టి, "దొరా, ఆకలి మాడిపోతున్నది. తిండి తినివచ్చి ఈ పని పూర్తిచేస్తేనేం?" అన్నాడు. "నాకూ ఆకలిగానే ఉంది. భోజనం అయినాక మళ్ళీ వద్దాం. ఇంక వీడెక్కడికి పోతాడులే!" అన్నాడు భూస్వామి.

వాళ్ళు వెళ్ళినాక మాత్సాయ్, "ఇంక నన్ను దింపండి!" అని కేకలుపెట్టసాగాడు. ఇంతలో భూస్వామి మామగారు కూతుర్ని చూడటానికి వస్తూ అటుగా వచ్చి, మాత్సాయ్

కేకలు విని, "ఎవర్రా అదీ?" అని కేక పెట్టాడు. మాత్సాయ్ ఆయన గొంతు గుర్తించాడు. ఆయనకు గూని ఉన్నదని వాడికి తెలుసు. వాడు ఆయనతో, "ఎవరో దేవుడల్లే వచ్చారు. దించండి, బాబూ! నా గూని పోయింది," అన్నాడు. భూస్వామి మామగారు, "గూని పోవటమేమిటి?" అన్నాడు.

"మీకు తెలీదుగామాలు. ఈ సంచీలో కూచుంటే గూని నయమవుతుంది. నన్ను దించండి, తమకే తెలుస్తుంది. మావాళ్ళు ఈపాటికి రావలసిందే మరి. ఎందుకో రాలేదు. మళ్లీ ఈ సంచీ తీసుకుపోయి అసలువాళ్ళ కివ్వకపోతే వాళ్ళు గంటకు నూరు తులాల వెండి గూబలుపిండి వసూలు చేస్తారు," అన్నాడు మాత్సాయ్.

"అదా సంగతి. నాకూ గూని ఉందిలే. నన్నుకూడా కాస్సేపు కూచోనిస్తావా? నీకు నూరు తులాల వెండి నేనే ఇస్తాలే!" అన్నాడు భూస్వామి మామగారు.

మాత్సాయ్ ఎలాగైతేనేం సంచీ నుంచి బయటపడి, భూస్వామి మామగారిని అందులో పెట్టి మళ్లీ చెట్టుకొమ్మకు కట్టి తన దారిన వెళ్ళాడు. తరవాత భూస్వామి తన మనిషితోసహా వచ్చి కొమ్మ కొట్టించి సముద్రంలో పడవేయించాడు.



కొద్దిరోజులు గడిచాయి. ఒకనాడు మాత్సాయ్ కావాలని పని పెట్టుకుని భూస్వామి ఇంటివేపుగా వచ్చాడు. భూస్వామి వాణ్ణి చూసి నిర్ఘాంతపోయి, "నువు చచ్చి పోతివిగా? మళ్లీ ఎలా వచ్చావు?" అని ఆశ్చర్యంగా అడిగాడు.

"మంచివాళ్ళెప్పటికీ చావరనుకోండి! నేను సముద్రంలో పడగానే సముద్రరాజు దూతలు వచ్చి నన్ను తీసుకుపోయారు. సముద్రరాజు నాకు గొప్ప విందు చేసి తన రాజ్యంలోనే ఉండిపొమ్మన్నాడు. నాకొక అప్సరసవంటి కన్యను పెళ్ళిచేశాడుకూడా. అక్కడ అందరూ అప్సరసలే! ఎక్కడ

చూసినా బంగారమూ, రత్నాలూనూ. అక్కడివాళ్లకు తినటమూ, తాగటమూ తప్ప ఇంకో పని లేదు. పాటుపడేవాడికి నాకు అక్కడ ఏంతోస్తుంది? అందుచేత వెళ్ళిపోతానని రాజుగారితో చెప్పాను. ఆయన వద్దన్నాడు. నేను వెళ్లితీరాలన్నాను. అయితే ఇష్టంవచ్చినప్పుడల్లా వస్తూఉండమనీ, దగ్గిర స్నేహితులుంటే తెస్తూఉండమనీ ఆయన అన్నాడు. నా భార్యను రమ్మంటే ఆ లోకం విడిచి రానన్నది!" అన్నాడు మాత్సాయ్.

"వీడు వట్టి వెర్రివెధవ! నేనైతే అక్కడి ఆడవాళ్లందరినీ పెళ్ళాడేసి, రాజును కాస్తా తొలగించి, నేనే రాజునై ఉందును!" అనుకున్నాడు భూస్వామి. ఆయన మాత్సాయ్‌తో, "ఒరే. నీకు పుణ్యం ఉంటుంది. ఒక్కసారి నన్నాలోకానికి తీసుకుపోదూ!" అన్నాడు.

మాత్సాయ్ మొదట ఒప్పుకోక చివరకు బలవంతాన ఒప్పుకున్నాడు. "మీరు ఎవరితోనూ ఈ విషయం బయటపెట్టకుండా రండి. లేకపోతే, వస్తామని అందరూ వెంట పడతారు. రెండు పడవలు రేపు ఉదయానికి సిద్ధంచేసి ఉంచుతాను," అన్నాడు మాత్సాయ్.

మర్నాటికి వాడు ఒక కొయ్య పడవనూ, ఒక పింగాణీ పడవనూ సముద్రం ఒడ్డున సిద్ధంగా ఉంచి, భూస్వామి రాగానే పింగాణీ పడవలో ఆయనను ఎక్కించి, తాను కొయ్య పడవలో ఎక్కాడు. రెండు పడవలూ సముద్రంలో చాలా దూరం పొయ్యాక మాత్సాయ్, దుడ్డుకర్రతో తన పడవమీద గట్టిగా కొడుతూ, "ఈ చప్పుడుకు సముద్ర రాజు దూతలు వస్తారు!" అన్నాడు. కాని ఎవరూ రాలేదు.

భూస్వామి జాప్యం భరించలేక, "నా పడవమీద కొట్టు. మోత బాగా అవుతుంది," అన్నాడు. మాత్సాయ్ పింగాణీ పడవను గట్టిగా కొట్టేసరికి అది కాస్తా పగిలిపోయింది. భూస్వామి సముద్రంలో మునిగిపోయాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1960 ఏప్రిల్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఫిబ్రవరి నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : "ఒక్కటి చెబుతా వింటావా ?"

రెండవ ఫోటో : "చక్కటి కబురే నంటావా ?"

పంపినవారు : కొంచాడ సోమేశ్వరరావు,

C/o కె. రాజయ్య & సన్స్, సోంపేట - (శ్రీకాకుళం జిల్లా.)

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.



# ప్రశ్నోత్తరాలు

[అసంఖ్యాకులైన పాఠకులు ఇంగ్లీషు సంవత్సరాదికీ, సంక్రాంతికీ శుభాకాంక్షలూ, అభినందనలూ పంపారు. "చందమామ" వాటిని కృతజ్ఞతతో స్వీకరిస్తున్నది. —సంపాదకుడు.]

1. వి. అహల్యాదేవి, బళ్ళారి

"అహింసాజ్యోతి" అయినతర్వాత దేన్ని ప్రచురిస్తారు?

సమాధానం వచ్చే సంచికలో తెలుస్తుంది.

2. టి. యస్. శంకర్ రావ్, పామిడి

విద్వాన్ విశ్వం విరచిత "పంచ తంత్రము" పుస్తక రూపాన ముద్రింతురా?

చందమామ "పుస్తక శాఖ"లో గేయకథల వంతు కూడా వస్తుంది.

3. పి. సుబ్బారావు, విశాఖపట్నం

అన్నయ్యా, "చందమామ"లో ప్రచురించిన "మకరదేవత" పుస్తక రూపంలో వెలువడిందా?

"తోకచుక్క - మకరదేవత" ఒకే సంపుటంగా త్వరలోనే వెలువడనున్నాయి.

4. తాళ్ళపల్లి నాగయ్యగుప్త, అయినాపురం

మీరు ప్రచురించబోయే "తోకచుక్క - మకరదేవత" "విచిత్ర కవలలు" కంటె వెల అధికంగా యున్నది, కారణం?

"విచిత్ర కవలలు" సుమారు 100 పేజీల పుస్తకం, బొమ్మలు ఒకేరంగు గలవి. "తోకచుక్క - మకరదేవత" మూడు రంగుల బొమ్మలతో సుమారు 300 పేజీలుంటుంది; దీనికి మంచి కాగితమూ, మంచి బైండూ ఉంటాయి. ఇది బహూకరణ యోగ్యమైన పుస్తకం. రెంటికీ పోలిక ఉండదు.

5. కె. వెంకయ్యశెట్టి, మద్దూర్

ప్రఖ్యాతమైన ఆటవస్తువు "మత్ర్యోష్క" వెల తెలిపెదరా?

"మత్ర్యోష్క" మన దేశంలో అమ్ముతున్నట్టు లేదు. అమ్మకానికి వస్తే అలాగే వెల తెలుపుతాం.

6. యం. కరుణకుమారి, పులివెందుల

గౌతమబుద్ధుడు ఎప్పుడు ఎట్లు మరణించెను?

ఆ వివరాలు మార్చినెల "చందమామ"లో చదువుతారు.

7. సి. వి. రమణ, ఖర్గపూర్

"మధ్యముడు" అనే కథలో భీముని మధ్యముడని సంబోధించితిరి. నా మిత్రుడు తృతీయుడని అంటున్నాడు—

భీముడు కుంతి కొడుకులలో మధ్యముడు, పంచపాండవులలో ద్వితీయుడు.

8. ఎస్. దామోదర్ రెడ్డి, నల్గొండ

క్రొత్త సీరియల్ "జ్వాలాద్వీపం" రచయిత ఎవరో తెలుసుకొనవచ్చునా?

"ఏకముక్క", "మకరదేవత", "ముగ్గురు మాంత్రికులు", "కంచుకోట" రచించినవారే.

9. అట్లూరి రత్నశేఖర్, విజయవాడ

రెండేళ్ళక్రితం "ఇంద్రజాలము" ట్రిక్కులను తెలిపిన సర్కార్‌గారి ఎడ్రసు తెలుపుతారా?

ప్రొఫెసర్ పి. సి. సర్కార్, 12/3 ఎ, జమీర్‌లేన్, కలకత్తా-19. ఈయన మరికొన్ని ట్రిక్కులను పంపారు. వాటిని త్వరలో ప్రచురిస్తాం.

10. జి. జానీమియా, దోమకొండ

"చందమామ" చదవాలని బలేయిష్టం, కాని కొనడానికి డబ్బులేదు. ఏం చెయ్యడం?

ఎరిగినవాళ్ళలో "చందమామ" కొనగలవాళ్ళే లేరా?

11. కొంకిమళ్ళ రంగనాయకమ్మ, విజయవాడ

మా యింట్లో 102 "చందమామ"లు జాగ్రత్తగా దాచినాను. అమ్మటానికి ఇష్టంలేకుండా ఉన్నది....

అమ్మటం దేనికి? 140 చందమామలు దాచిన పాఠకుడు కూడా ఉన్నాడు. "చందమామ" పుట్టినాక పుట్టిన పిల్లలు కూడా వాటిని చదువుతూ, ఆనందిస్తున్నారుగదా!

12. వి. జానకి, పెద్దాపురం

దాసూ వాసూలకి "టైగర్" ఎక్కడ దొరికిందో తెలిస్తే నేనూ కొందును....

వేరే డబ్బు పోసి కొనటం దేనికి? "టైగర్" మీ అందరిదీనూ....

# చిత్రకథ





ఒకరోజున దాసూ, వాసూలు చెరువు ఒడ్డున వున్న ఒక చెట్టు కొమ్మకు తాడు కట్టి, దాని ఉచ్చులోకుండా చెరువు నీళ్ళలోకి దూకుతూ అడుకుంటున్నారు. ఆ సమయంలో ఒక కొంటె కుర్రాడు తన కాట్లకుక్కను, 'టైగర్' మీదికి ఉసి కొల్పాడు. 'టైగర్' పారిపోయివస్తూ దాసూ, వాసూలు దూకుతున్న తాడు ఉచ్చు లోంచి ఎగిరి చెరువునీళ్ళలో పడింది. దానిని తరుముకు వస్తున్న పెద్ద కాట్ల కుక్క కూడా అలాగే ఉచ్చులోంచి దూకబోయి, తాడు నడుముకు బిగుసు కోవటంతో, ఆ ఊపుకు తెగిన తాడుతో కూడా వెళ్ళి చెరువుమధ్య పడిపోయింది. ఇది చూసి కొంటెకుర్రాడు లబోదిబోమన్నాడు. దాసూ, వాసూలు నవ్వుకున్నారు.






**Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3 Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'**

# వస్తోంది!



రవుతూ పిక్చర్సు వారి







సముజ్వల
సాంఘిక చిత్రం









# నిత్యకళ్యాణం
# పచ్చతోరణం







రచన, దర్శకత్వం...ఎస్.ఆర్.పినిశెట్టి

సంగీతం * ఛాయ * పాటలు * కళ
పెండ్యాల * ప్రసాద్ * ఆరుద్ర * బి.యస్.కృష్ణ

నిర్మాత: తోటకృష్ణమూర్తి + నిర్వహణ: కె.శ్రీరామమూర్తి

RAMIDAS K CHITHRALEKHA

డిస్ట్రిబ్యూటర్స్:— ఆంధ్రా: గౌతమీ పిక్చర్స్, విజయవాడ. ★ సీడెడ్: భాస్కర్ పిక్చర్స్, గుంతకల్. ★ నైజాం: ఉదయశ్రీ పిక్చర్స్, సికింద్రాబాద్.

Photo by Brahm Dev



బహుమతి
పొందిన వ్యాఖ్య

'చక్కటి కబురే నంటావా?'

పంపినవారు:
కె. ఎస్. రావు - సోంపేట

